# 15, 16 శతాబ్దాల తెలుగు సాహిత్యంలో సంగీత గద్య ప్రబంధాలు



సి. విజయలక్ష్మి



1989 లో తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆమోదం పొంది,
రెండు స్వర్ణ పతకాలను పొందిన ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసం.

# 15, 16 శతాబ్దాల తెలుగు సాహిత్యంలో సంగీత గద్య ప్రబంధాలు



సి. విజయలక్ష్మి



1989 లో తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆమోదం పొంది,
రెండు స్వర్ణ పతకాలను పొందిన ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసం.

ముద్రణ : మే 1992

ప్రతులు : 1000



పుస్తకం పేరు : 15, 16 శతాబ్దాల తెలుగు సాహిత్యంలో సంగీత గద్య ప్రబంధాలు.

రచయిత్రి : సి. విజయలక్ష్మి.

వెల రు. 20/-

ప్రతులకు : సి. విజయలక్ష్మి
ఇం. నెం. 3-22/3
న్యూ మారుతీనగర్
కొత్తపేట, హైదరాబాదు - 500660.
ఫోన్ : 878479

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1,
న్యూ బాకారం, గాంధీనగర్
హైదరాబాదు - 500 380.
ఫోన్ : 611413.

# విషయసూచిక

# ముందుమాట

చిన్నప్పటి నుండి సంగీతాన్ని సాధన అనే యోగంతోటే సంపాదించు కోవాలని అమ్మానాన్నగారూ చెప్తుండేవారు. మా నాన్నగారు నిరంతర సాధన చేస్తూంటే ఆయన పాడిన ప్రతీపాటా కాకపోయినా నానేర్చిన పాటల్లో సగానికి పైగా వినికిడి వల్ల వచ్చినవే. పరిస్థితులు తెలుగు సాహిత్యాధ్యయనం వైపుకు మళ్ళించేసరికి సంగీతాభ్యాసం కొంత వెనకడుగు వేసింది. కానీ సంగీత సాహిత్యాల సమన్వయంతో పరిశోధన చెయ్యాలనే తపన మాత్రం ఉండేది. నా ఆశయ సాధనకు తెలుగు విశ్వవిద్యాలయం ప్రోత్సాహాన్నిచ్చింది.

నా అదృష్టం కొద్దీ మాస్టారు బాలాంత్రపు రజనీకాంతరావుగారు నాపట్ల వాత్సల్యంతో నన్ను ఆదరించి "గద్యప్రబంధ లక్ష్య లక్షణ సమన్వయం" చేయమని అంశం ఇచ్చారు.

"మాస్టారూ, నాకు ఈ శ్లోకాలు అర్థం కావట్లేదు చెప్పండి" అని ఎప్పుడు వెళ్ళి అడిగినా విసుక్కోకుండా అర్థం అయ్యేట్లు చెప్పి, ఇంకా బాగా చెయ్యమ్మా అని ప్రోత్సాహపరచిన మాస్టారూ, సాహిత్య పీఠం అధిపతి ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారు.

నిర్ణీత సమయం దాటిపోతున్నా, మేడం, నాకు ఫలానా పుస్తకం కావాలి అంటే అంతకన్నా ఏముంది తీసుకో అంటూ వెదకి వచ్చేవారు గ్రంథాలయాధికారిణి శ్రీమతి తారాబాయిగారు.

బాగాచేసి మంచిపేరు తెచ్చుకోండంటూ ఉత్సాహపరిచేవాళ్ళు సాహిత్య పీఠం కార్యాలయ సిబ్బంది.

నేనూ సాయం చేస్తానంటూ రాసిన కాపీ తిరిగి రాయడానికి సహాయం చేసిన మిత్రుడూ సహాధ్యాయీ ప్రకాష్.

ప్రచురణకు అనుమతినిచ్చి ఆర్థిక సహాయం చేసింది తెలుగు విశ్వవిద్యాలయం.

టైటిల్ పేజీ, ముద్రణకు సహాయపడిన స్నేహశీలి జ్యోతిప్రకాష్.

పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చినవారు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీనివాస్‌గౌడ్‌గారూ, వారి సిబ్బంది.

ఇంకా పరోక్షంగా ఇతోధిక సాయంచేసిన మిత్రులు చాలామంది.

వీరందరికీ నా మనఃపూర్వక కృతజ్ఞతాభినందనలు.

మరొక్క మాట—

ఈ లఘు సిద్ధాంత వ్యాసం సాహిత్యంలోని వచనాలను సంగీత గద్య ప్రబంధ లక్షణాలతో సమన్వయ పరచడం కేవలం తొలి ప్రయత్నమే కాని సమగ్రం కాదు.

ఇలాగే మిగిలిన సంగీత ప్రబంధ లక్షణాలను సాహిత్యంతో సమన్వయ పరచడానికి నా యీ వ్యాసం ఏ మాత్రం తోడ్పడినా నాయీ కృషి ఫలించిందనే భావిస్తాను.

తెలిసీ తెలియక చేసిన తప్పులేమైనా ఉంటే క్షమించి సరిదిద్దగలరని భావిస్తూ—

—సి. విజయలక్ష్మి

# ఆశీస్సులు

సాహిత్యంలో గానీ సంగీతంలో గానీ గద్య ప్రబంధాలు అనే విషయం నా ప్రసార మాధ్యమానుభవం (బ్రాడ్‌కాస్టింగ్)లో పలుసార్లు నన్ను వ్యక్తిగతంగా ప్రేరేపించినది. బాణకవి అచ్ఛోద సరోవర వర్ణనాగద్య శ్రీమద్రామానుజాల సంస్కృత గద్యాలు రాగయుక్తంగా గానం చేసాను. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి రచించిన జటాయుకృత రామస్తుతి నిలయ విద్వాంసులు ఆర్.కె. వేంకట రమణశాస్త్రిగారు గానం చెయ్యగా విన్నాను. ఆయన గానం చేసిన కర్ణాటక గమకీ పద్ధతికి తెలుగువారి పౌరాణిక గద్యగాన పద్ధతి అన్ని విధాలా సరితూగుతుందని తెలుసుకున్నాను.

ప్రసార మాధ్యమంలో కృతకృత్యుణ్ణై వదలిన పదేళ్ళకు తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్యపీఠం, రాజమండ్రి ప్రాంగణంలో ఆచార్య పీఠంపై అధివసించి సంగీత సాహిత్యాల పరస్పర సంబంధ పరిశోధనాంశాల అన్వేషణలో "తెలుగు సాహిత్యంలో సంగీత గద్య ప్రబంధాలు" పరిశోధన చేయదగిన అంశం అని స్ఫురించడం, నా పర్యవేక్షణలో పరిశోధకురాలిగా చేరిన చిరంజీవిని చల్లా విజయలక్ష్మి తనకు సంగీతసాహిత్యాలలోగల పూర్వాభినివేశం ఊతగా నాకిష్టమైన ఈ అంశాన్ని ఎంతో మమకారానందాలతో స్వీకరించడం నాకెంతో ఆనందాన్ని, ఆమె పరిశోధనా వ్యాస నిర్వహణ నాకెంతో సంతృప్తినీ ఆమోదాన్నీ కలిగించాయి.

ఆమె పరిశోధన సలక్షణంగా ఎలా జరగాలో అలా జరిగిందని ప్రకటించడానికి సంతోషిస్తున్నాను.

భరతుని నాట్యశాస్త్రం, శార్ఙ్గదేవుని రత్నాకరం దీర్ఘ దృష్టితో పరిశీలించింది.

కథా కావ్యయుగం, ప్రబంధ యుగాలలోని కవులే కాక ఇతర కవుల చెప్పుకోదగిన గద్య కవితా విశ్వరూపాలను ఎంపిక చేసి పలు కోణాలతో పరిశీలించి వాటి గణనీయతను, ప్రత్యేకతలను ప్రశంసనీయంగా ప్రదర్శించింది. ఆయా వచనాలను శార్ఙ్గదేవాదులు సూచించిన లక్షణాలను అనుసరించి గానంచేసే సందర్భంలో సాహిత్యంలో మారే శైలులకు అనుగుణమైన ఘన నయ పద్ధతుల రాగాలాపనలను ఏవిధంగా జోడించాలో సూచన ఇస్తూ వచ్చింది.

ఈ పరిశోధకురాలు నా ప్రసార మాధ్యమ సేవా కాలంలో నా సహవ్రతులూ సంగీత విద్వాంసులూ అయిన శ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రి కుమార్తె కావడం, సరస్వతీ క్షీరవాహినీ ద్వయంలో ఈదులాడే వ్యాసంగం కలది కావడం, ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఇంత జయప్రదంగా పురస్కారార్హంగా తయారు చేయగలగడం నా కెంతో సంతోషాన్ని కలిగించాయి.

సంగీత సాహిత్య సంబంధ పరిశోధనలో ఈ చిరంజీవినికి మంచి భవిష్యత్తు ఉందని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

బాలాంత్రపు రజనీకాంతరావు
16-4-92

విభావరి
ఎస్. ఎఫ్ (1) - బి బ్లాక్
వీనస్ అపార్ట్‌మెంట్స్
పెకిలో రోడ్డు
విజయవాడ - 10.

# 15, 16 శతాబ్దాల తెలుగు సాహిత్యంలో సంగీత గద్య ప్రబంధాలు

## సంగీత ప్రశంస

లలితకళా విభాగానికి చెందిన కళలు సంగీత సాహిత్యాలు. కళలవల్ల ఆనందానుభూతి పరమ ప్రయోజనం. సంగీత శాస్త్రాల్లో సంగీత ప్రశంస ఈ విధంగా ఉంది:

"త్రివర్గ ఫలదాః సర్వే దానయజ్ఞ జపాదయః
ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదం"[1]

ధర్మార్థకామాలను మాత్రమే దానయజ్ఞ జపాదులు కలుగజేస్తాయి. ఒక్క సంగీత జ్ఞానం మాత్రం చతుర్వర్గ పురుషార్థాలనూ ఇస్తుంది.

"వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతి విశారదః
తాళజ్ఞశ్చా ప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి"[2]

శ్రుతి జాతి విశారదుడై తాళజ్ఞుడై వీణావాదన విశారదుడైన వానికి మోక్షం కరతలామలకం అని యాజ్ఞవల్క్య స్మృతి.

"నాహం వసామి వైకుంఠేనయోగి హృదయ రవౌ
మద్భక్తాయత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద"[3]

భగవంతుడనైన నేను వైకుంఠంలో గానీ, యోగిజన హృదయాల్లో గానీ, సూర్య మండలంలో గానీ వసించక భక్తులు ఎక్కడ గానం చేస్తారో అక్కడ ఉంటానని భగవంతుడు చెప్పినట్లుగా విష్ణు పురాణం సూక్తి.

---

1. శివసర్వస్వం
2. సంగీత రత్నాకరః
3. విష్ణు పురాణం

పై వివరణలు బట్టి వాటి అర్థాన్ని గమనిస్తే కళల్లో అత్యుత్తమ కళగా సంగీతాన్ని పేర్కొనడమే కాకుండా భగవత్సాన్నిధ్యాన్ని త్వరగా పొందింప జేసేది కూడా గానకళే అని చెప్పక తప్పదు.

కాయపరిశ్రమ చేసేవాళ్ళు తమ పనులు చేసుకుంటూ ఏదో ఒక కూని రాగాన్ని తీస్తూంటారు. ఆ రాగంలో తమకు నచ్చిన, తగిన పురాణ కథని పాడటంలో తన్మయత్వాన్ని పొందుతారు. ఆ విధంగా తాము చేసే శ్రమను మర్చిపోతారు. తామే మైమరవడం కాకుండా ప్రకృతిని పులకింపజేసే మాధుర్యాన్ని తమ గొంతులో నిలుపుతారు జానపదులు.

శ్రమజీవుల శ్రమను పోగొట్టేందుకే మొదట సాధనమైంది గానం. జానపదునికి ఇది సుస్వరమా? ఇది ఏ రాగం?ఏ తాళంలో ఉన్నది? అనే వివేచన ఉండదు. ఆ వివేచన వల్ల అతనికి ప్రయోజనం ఉండదు. ప్రకృతిని కూడా పరవశింపజేసే శక్తి ఒక గానానికే ఉందని ఆది నుండి మనకు స్పష్టం.

## సాహిత్య ప్రశంస

కవి యొక్క అనుభవపూర్వక లేదా ఊహాజనిత అక్షర రూపం సాహిత్యం.

కవి యొక్క శక్తి సామర్థ్యాలను బట్టి ఆ సాహిత్యంలో చిత్రితమైన రూపాన్ని మనోనేత్రాలకు సాక్షాత్కరింప జేస్తాడు. తద్వారా సహృదయుడు ఆనంధ్దాన్ని పొందుతాడు. ఆ ఆనందానుభూతి పఠిత నిశిత భావనా పటిమపై ఆధారపడి ఉంటుంది. చదివిన వెంటనే రసానందం కలగటం అన్ని కావ్యాల్లోనూ సాధ్యపడదు.

రమణీయార్థ ప్రతిపాదకమై, శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ మొదలైన కావ్యగుణాలు సమగ్రంగా నిక్షిప్తమై ఉన్న కావ్యం వల్ల సహృదయులకు రసానందం కలుగుతుంది. ఉపదేశం కూడా సాహిత్యంలో పరమ ప్రయోజనం.

## సంగీత సాహిత్యాల సంబంధం

తిలక్ అన్నట్లు కవితాక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆడ పిల్లల్లా ఉండాలి. అప్పుడే ఆనందం దాని పరమావధి అవుతుంది. అటు వంటి సాహిత్యానికి సొంపుకూర్చేది సంగీతం. నిజానికి సాహిత్యంలోని శ్రవణ సుఖాన్నీ, అక్షర లయబద్ధతనూ సంగీత లక్షణాలుగా చెప్పవచ్చు.

"సంగీతంలో సాహిత్యం వ్యక్తం, సాహిత్యంలో సంగీతం అంతర్నిహితం"[1]. ఇవి రెండూ అవినాభావసంబంధాలు కలవి. అవి పరస్పర పోషకాలు. అందుకే చేరువై సరస్వతీ స్తనద్వయమయ్యాయి.

"సంగీత మపిసాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏక మాపాత మధురం అన్యదాలోచనామృతమ్"

ఈ సంగీత సాహిత్యాలు పరమాత్మ స్వరూపాలనీ

"కావ్యాలాపాంశ్చయే కేచిత్ గీతాని సకలానిచ
శబ్ద మూర్తిధరస్యైతే విష్ణోరంశామహాత్మనః"

అని విష్ణు పురాణం చెప్తోంది.

సంగీత సాహిత్యాలు తెలియనివాడు పశువుతో సమానమని పెద్దలు అంటారు.

"సంగీతకేన రమ్యేణ సుఖం యస్యనచే తసి
మనుష్య మహిషో లోక విధినైవ నవంచితః"

"సంగీత సాహిత్య రసానభిజ్ఞ స్సాక్షాత్పశుః పుచ్ఛ విషాణహీనః"

సంగీత సాహిత్యాలు తెలియని మనుష్యుని తోకా, కొమ్ములూ లేని పశువుగా చెప్పబడెను.

సంగీత సాహిత్యాలవల్ల ప్రయోజనం ఒక్కటే అయినా సాధనలో కొంత భేదం ఉండనే ఉంది.

---

1. సాహిత్యంలో సంగీతప్రతిపత్తి-శ్రుతి—

## పరస్పర పోషక వివరణ

సంగీత మనేది గీత వాద్య సమ్మేళనం. సాహిత్యం సంగీతం కలిసి ఉండవచ్చునని దాన్ని గీతం అంటారని సంగీత సూర్యోదయం చెబుతోంది.

"(రంజకః) స్వరసమూహో గీతమిత్యభిధీయతే
తదేవ కశ్చిద్ విద్వద్భిర్ధాతు రిత్యభిధీయతే"[1]

"గీర్వాణముఖ భాషాణాంపదం మాతురితీరితమ్
ధాతుమాతు సముత్పన్నం గీత మిత్యుచ్యతే బుధైః"[2]

"వీనుల విందై యమృతపు
సోనల పొందై యమందసుమచలదళిపి
గానము క్రందై యాస్వన
మానంద బ్రహ్మమైన నధిపతి వల్కెన్"[3]

అన్న రామరాజభూషణుని ఆ మాటలను బట్టి హృదయాన్ని పరవశింపజేయ గల శక్తి సంగీతానికి ఉందని తెలుస్తోంది. అటువంటి సంగీతం కవితాత్మకం అయితేనే ఆ శక్తి సమకూరుతుంది.

సంగీతం వట్టి నాద రూపం అయితే తద్వారా ఆనందానుభూతి కలగ వచ్చు గాని సంగీతజ్ఞుడు మాత్రమే దాన్ని గ్రహించగలుగుతాడు. అయినా ఆలాపనకి మాటల సహకారం లేకపోతే అది రాక్షస గానం అవుతుందని భరతుడు నాట్యశాస్త్రంలో చెప్పాడు.[4]

అందువల్ల దానికి భాషారూపమైన కవిత్వం జత ఐతే మిశ్రకళగా అందరకూ రసాస్వాదన కలిగిస్తుంది. భాషా సహాయం అపేక్షించకుండా

---

1. సంగీత సూర్యోదయం } ప్రబంధాధ్యాయం
2. సంగీత సూర్యోదయం }
3. వసుచరిత్ర - ద్వితీయాశ్వాసం - 14 వ పద్యం.
4. నాట్యశాస్త్రం

గానం ఉండవచ్చు. అలాగే శుద్ధగానం అపేక్షించని కవిత్వం ఉండవచ్చు. కాని శుద్ధగానానికి కవితా సాహచర్యం ఉంటే గీత మాధుర్యం శ్రోతలకు త్వరగా సులభంగా అందుతుంది.

అదీగాక పూర్వకాలం పురాణ శ్రవణం, కావ్య పఠనం చేయడం గానాన్ని ఆలంబనంగా చేసుకునే ఉండేది.

పురాణ శ్రవణం చేసే వారిని రాజరాజ నరేంద్రుని కాలం నుండి రాజాస్థానాల్లో ప్రత్యేకంగా నియమించేవారు. వారికి తప్పనిసరిగా సంగీత శాస్త్రం తెలిసి ఉండాలి. సాహిత్యానికి సంగీతం ఒక తొడవు చేసి ఆ చేర్పు రసస్ఫోరకంగా ఉండేట్లు, ఏ భావానికి ఏ రాగం సరిపోతుందో ఆ విధంగా శ్రోత్రానందజనకంగా పురాణశ్రవణం చేయడం ఇప్పటికీ దేవాలయాల్లో కొన సాగుతోంది. ఈ కళలు దేనికది ప్రత్యేక కళలైనా పరస్పర సాంగత్యం ఆదికాలం నుండీ ఉంటూనే ఉంది.

## సంగీతపరంగా మార్గ-దేశి

సర్వకళల సమాహారం అయిన నాట్యంలో అంతర్భాగంగా పితామహుడూ సృష్టికర్తా అయిన బ్రహ్మ సంగీతాన్ని సామవేదం నుండి గ్రహించి సృష్టించాడని మన దేశపు ప్రాచీన సంగీత శాస్త్రజ్ఞులందరూ విశ్వసిస్తారు.

దేవతలూ మునులూ కలిసి సృష్టికర్త వద్దకు వెళ్ళి సృష్టిలోని అన్ని జాతులవారూ ఆనందించేందుకు వీలయిన 'క్రీడనీయకం' ఒక వినోద ప్రక్రియను ప్రసాదించమని కోరారు.

"నాట్యవేదస్త తశ్చక్రే చతుర్వేదాంగ సంభవమ్
జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యోగీతమేవచ
యజుర్వేదాదభినయాన్ రసాథర్వణాదపి"1

1. నాట్యశాస్త్రం

ఋగ్వేదం నుండి (పాత్రలు గానం చేయవలసిన) పాఠ్యాన్నీ, సామవేదం నుండి సంగీతాన్నీ, యజుర్వేదం నుండి అభినయాన్నీ, అథర్వణ నుండి రసాన్నీ, రసప్రయోగవిధానాన్ని స్వీకరించి విధాత నాట్యవేదాన్ని సృజించాడు.

ఆ సంగీతంలో వచ్చిన పరిణామక్రమ వివరణా, తరువాత దేశి సంగీత పద్ధతీ ఈ ప్రకరణంలో చర్చనీయాంశాలు.

## కొన్ని నిర్వచనాలు :

## గాంధర్వం - మార్గగానం

"మార్గోదేశీతి తద్ ద్వేధా తత్ర మార్గస్య ఉచ్యతే
యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తోభరతాదిభిః"[1]

"దేవస్య పురతశ్శంభోర్నియతాభ్యుదయ ప్రదః
దేశదేశ జనానాం యద్రుచ్యా హృదయరంజకమ్
గీతం వాదనం నృత్తం తద్దేశీత్యభిధీయతే
.... .... .... .... .... .... ...."[2]

"రంజకస్వర సందర్భో గీతమిత్య భి ధీయతే
గాంధర్వంగాన మిత్యస్య భేద ద్వయ ముదీరితమ్"[3]

"అనాది సంప్రదాయం యద్గంధర్వైః సంప్రయుజ్యతే
నియతం శ్రేయసో హేతు స్తద్గాంధర్వం జగుర్బుధాః"[4]

"అత్యర్థమిష్టం దేవానాం తదా ప్రీతికరం పునః
గంధర్వాణామిదం యస్మాత్ గాంధర్వముచ్యతే"[5]

బ్రహ్మచేత వెదకబడి (మార్గితః) భరతాది మునులచే ప్రయోగింపబడినది (ప్రయుక్తః) గాంధర్వం. ఇది మార్గ సంగీతం.

---

1. సంగీత రత్నాకరః - స్వరాధ్యాయః - 22 శ్లోకః
2. సంగీత రత్నాకరః - స్వరాధ్యాయః - 23, 24 శ్లోకాః
3. సంగీత రత్నాకరః - ప్రబంధాధ్యాయః
4. సంగీత రత్నాకరః - ప్రబంధాధ్యాయః
5. సంగీత రత్నాకరః - ప్రబంధాధ్యాయః.

అనాది సంప్రదాయమై దేవతలకు, అందునా గంధర్వులకు ఇష్టమైనది కనుక గాంధర్వం అనే పేరు భరతుడే ప్రకటించాడు.

గీతవాద్య నృత్తాలతో ఆయా దేశ జనుల రుచ్యనుసారం హృదయ రంజకమై ప్రవర్తిల్లేది దేశి సంగీతం. ఆయా దేశ భాషా ప్రాంతాలలో శాస్త్రీయతా గౌరవం పొందిన ప్రాంతీయ సంగీతమే దేశి సంగీతం.

## స్వర పరిణామం

వైదిక సంగీతం తొలి దశలో 'ఆర్చికం' అంటే ఏక స్వరంగా 'ఓం' కారనాదంగా ఉండేది. తరువాత - 'గాధికం' రెండు స్వరాలతోనూ, 'సామికం' అనగా మూడు స్వరాలతోను ఉదాత్త అనుదాత్త స్వరితాలనే త్రిస్వరాలతో ఆలపించేవారనీ, క్రమంగా ఆ వేద మంత్రాలు చతుస్వర, పంచస్వర సప్త స్వరాలతో గానం చేసేవారనీ నారదీయ శిక్షవల్ల తెలుస్తోంది. ఈ స్వరాలు మార్గ సంగీతంలో మంద్ర మధ్య తార స్థాయులలో ఒక్కొక్క దానికి ఏడేసి చొప్పున ఏర్పడ్డ సప్తస్వరాలు. వేదకాలంలో వీటికి 'యమా'లని పేరు. ఈ స్వరాలే క్రమంగా లౌకిక గానంలోకి వచ్చాయని నారదీయ శిక్షవల్ల విదితమౌతోంది. సప్తస్వరాలు లౌకికగానంలోకి ఏ విధంగా ప్రవేశించాయో దీనివల్ల తెలుస్తోంది.

"యస్సామగానాం ప్రథమః సవేణోర్మధ్యమ స్వరః
యో ద్వితీయః సగాంధారః తృతీయ స్త్వృషభస్మృతః
చతుర్థః షడ్జ ఇత్యాహుః పంచమో ధైవతో భవేత్
షష్ఠోనిషాదో విజ్ఞేయః సప్తమః పంచమస్మృతః"1

సామగాన సంగీతంలోని ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ,పంచమి, షష్ఠి, సప్తమ స్వరాలు వరుసగా మధ్యమ, గాంధారం, ఋషభం, షడ్జం, నిషాదం, ధైవతం, పంచమాలుగా లౌకిక సంగీతంలోకి ప్రవేశించాయి.

షడ్జ మధ్యమ గ్రామాలు 2 అనీ, స్వరాలు 7 అనీ, 22 శ్రుతులనీ, ఇది స్వరమండలమనీ భరతుడు నిర్దేశించాడు.

---

1. నారదీయ శిక్ష-చతుర్థీకండికాః 1, 2 శ్లోకాః

"చతుశ్చతు శ్చతుశ్చైవ షడ్జమధ్యమ పంచమాః
ద్వే ద్వే నిషాద గాంధారౌ త్రిస్త్రిరిషభ ధైవతౌ"1

షడ్జ మధ్యమ, పంచమాలు ఒక్కొక్క దానికి 4 శ్రుతులు. నిషాద, గాంధారాలకు రెండేసి శ్రుతులు. రిషభ ధైవతాలకు మూడేసి శ్రుతులు. మొత్తం 22 శ్రుతులు ఏర్పరిచారు. స్వరానికీ స్వరానికీ మధ్యగల అంతరాన్ని బట్టి ఈ శ్రుతులు ఏర్పడతాయి.

ఒక్కొక్క స్థాయికి 22 శ్రుతులు లేక శ్రుత్యంతరాలు - ఆ అంతరాలలో షడ్జానికి పైన 3 శ్రుతుల అంతరంలో రిషభం, 2 శ్రుతుల అంతరంలో గాంధారం, దానిపైన 4 శ్రుతుల అంతరంలో మధ్యమం, దానిపైన 4, 3, 2, శ్రుతుల అంతరాలలో క్రమంగా పంచమ, ధైవత, నిషాదాలూ, నిషాదం తర్వాత 4 శ్రుతుల అంతరంలో షడ్జం (తారషడ్జం) ఈ అంతరాలలో ఉన్న శ్రుతులు మొత్తం 22.

ఇవి షడ్జగ్రామపు శుద్ధ స్వరాలు. మధ్యమ గ్రామంలో మాత్రం పంచమానికి 3 శ్రుతులూ, ధైవతానికి 4 శ్రుతులూ ఉంటాయి.

## రామాయణ కావ్యంలో మార్గగాన ప్రసక్తి

మార్గగాన పద్ధతిలో రామాయణ కథను కుశలవులు ఆలపించేరని రామాయణం చెబుతోంది:

"పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్
జాతిభిః సప్తభి ర్బద్ధం తన్త్రీలయసమన్వితమ్"

"రసైః శృంగార కారుణ్య హాస్య వీరభయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేత దగాయతామ్"

"తౌతు గాన్ధర్వతత్త్వజ్ఞౌ మూర్చనాస్థాన కోవిదౌ
భ్రాతరౌ స్వర సమ్పన్నౌ గంధర్వావివ రూపిణౌ"

---

1. సంగీత శాస్త్రసారం - మొదటి భాగం

"తతస్తు తౌ రామవచః ప్రచోదితౌ
అగాయతాం మార్గ విధాన సంపదా"[1]

**తాత్పర్యం :** కుశలవులు ఆ కావ్యమును చక్కగా గానము చేసిరి. ఆ కావ్యములోని చదువదగిన అంశము (సాహిత్యము) గానము చేయు అంశము (సంగీతము) కూడా మధురముగా ఉన్నవి. అనగా ఈ కావ్యములోని భాషార్థాది విషయములు మధురముగా నుండుటయేగాక, ఇది గానమునకు కూడా అనువుగా ఉండుటచే దీని గానము కూడా మధురముగనే ఉన్నది. ద్రుత-మధ్య-విలంబితములను ప్రమాణములను, షడ్జాది సప్త స్వరములను కూడా ఇందు చక్కగా నిర్వహించుటకు వీలున్నది. ఇది వీణ తంత్రులపై లయ కలిపి పాడుటకు అనువుగా ఉన్నది. ఆయా స్థానములలో ప్రసంగానుగుణముగా శృంగార-హాస్య-కరుణ-రౌద్ర-వీర-భయానక-బీభత్స-అద్భుత-శాంత రసములు నిర్వహింపబడినవి. దీనిని పాడిన కుశలవులను సోదరులు కూడా సంగీత శాస్త్ర రహస్యములు తెలిసినవారు. మూర్ఛనా స్థానములను గుర్తించగలిగినవారు. వీరి కంఠస్వరము అతి మధురము. మనుష్య రూపము ధరించిన గంధర్వులవలె ఉన్నారు. శ్రీరాముని వచనముల వల్ల ప్రోత్సహితులై మార్గ సంగీత ప్రయోగంలో సంపత్కరమైన కౌశలం కలిగిన ఆ సోదరు లిరువురు రామాయణం గానం చేశారు.

"తౌ చాపి మధురం రక్తం స్వంచితాయత నిస్వనమే
తన్త్రీలయ పదత్యర్థ విశ్రుతార్థమగాయతామ్"[2]

**తాత్పర్యం :** ఆ కుశలవులు మధురముగాను, రాగయుక్తంగాను గానము చేసిరి. వారి కంఠధ్వని చాల చక్కగా దీర్ఘముగ ఉండెను. వారి పాట వీణాతంత్రుల లయకు సరిపడి ఉండెను. అర్థము స్పష్టముగా తెలియుచుండెను.

---

1. రామాయణం - బాలకాండం - చతుర్థ సర్గః 8, 9, 10, 11 శ్లోకాః
2. రామాయణం - బాలకాండం - చతుర్థ సర్గః

## సంగీతశాస్త్రం బృహద్దేశి

## శాస్త్రగతం అయిన జనవ్యవహార దేశి గానం

భరతునికి భిన్నంగా లౌకిక గాన రీతులనూ, రాగాలనూ ఎన్నింటినో వివరించిన ప్రథమ సంగీత శాస్త్రకారుడు మతంగుడు. "బృహద్దేశి" అని అతని గ్రంథానికి పేరు పెట్టడంలో ఔచిత్యం కానవస్తోంది.

దేశ వ్యవహారంలో ఉన్న రాగాలను గ్రహించి వాటిలో జనక రాగాలు, భాషాంగ రాగాలు ఇలా వివరించాడు మతంగుడు. అదీగాక ప్రబంధాధ్యాయ మనే అధ్యాయంలో పూర్తిగా దేశి సంప్రదాయంలో ఉన్న ఏల, ద్విపద, గద్యం, ఉత్కళిక, ఢేంకి, వర్తనీ ఇత్యాది రచనలకు స్వరూప స్వభావాలతో లక్షణాలు వివరించిన గ్రంథం బృహద్దేశి.

> "దేశి కార ప్రబంధోఽయం హర వక్త్రాద్వి నిర్గతః
> అసంఖ్యాకాస్తు కథితాః నజ్ఞాయంతేఽల్ప బుద్ధిభిః
> తేషాం మధ్యాత్ సముద్ధృత్యయుక్త లక్షణ లక్షితాన్
> శ్రీమతఙ్గో మునిః ప్రాహ మునీనుద్దిశ్య తద్యథా
> .... .... .... ....
> .... .... .... ....
> .... .... .... ...."[1]

ఇలా దేశి సంబంధి రచనలు ఇంచుమించుగా గ్రంథస్థం అయ్యాయి.

## సాహిత్య పరంగా

## మార్గ-దేశి

సంగీత నాట్యాలలో వలె సాహిత్యంలో కూడా మార్గ-దేశి భేదాలున్నాయి. తెలుగులో ఈ మార్గ-దేశి పదాలు కవిత్వపరంగా ప్రయోగించిన మొదటి కవి నన్నెచోడుడు.

1. బృహద్దేశి - 397

"మును మార్గ కవిత లోకం
బున వెలయగ దేశి కవిత పుట్టించి తెనుం
గున నిల్పిరంధ్ర విషయం
బున జన చాళుక్య రాజు మొదలుగ పలువుర్"[1]

మును మార్గ కవిత వెలసిన దరిమిలా దేశి కవితను చాళుక్య భూవరులు ప్రోత్సహించారని భావం. ఈ పద్యం మూలంగా తెలుగు విమర్శకులు పలు పుంతలు తొక్కారు.

"చాళుక్య రాజు నాటికి ఈ దేశమున మార్గకవిత యనిపించుకొన్న సంస్కృతమే యున్నది. అతడు దేశికవితను అనగా దేశభాషా కవితను పుట్టించెనన్న అర్థమే చక్కగా పొసగును. దేశభాషా కవిత్వమే దేశి. ఈ ప్రమాణమును బట్టి నన్నయ భారతము దేశి కవిత్వము. వ్యాస భారతము మార్గ కవిత్వము."[2]

డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు సారస్వత వ్యాసాల ప్రథమ సంపుటికి వ్రాసిన తమ పీఠికలో "మార్గ కవిత్వం అంటే నన్నయాదులు రాసిన కవిత్వం అనీ, దేశి కవిత్వం అంటే ఒక శాఖగా జానపద సాహిత్యమనీ పేర్కొన్నారు."[3]

"మార్గ కవుల్లో నన్నయభట్టు భగీరథకల్పుడు. ఆంధ్ర కవితా భాగీరథిని మార్గ ఫణితిలో ముందుకు ప్రవహింపజేశాడు" అన్నారు. మరొకచోట "ఆంధ్ర కవితా రంగంలో మార్గ కవితా ప్రస్థాన భేరి మ్రోయించినవాడు నన్నయ భట్టారకుడు" అనీ నిర్ధారించారు.

మార్గ శబ్దాన్ని రీతి అనే అర్థంలో దండ్యాదులు పేర్కొన్నట్లుగానూ అదే రసానుభూతినందించే వాగ్రూప మధుధార అనీ, అదే మార్గ కవిత అనీ, అట్టి మార్గ కవితని నన్నయ హృద్యంగా లోకానికి అందించేడనీ వివరించారు.

---

1. కుమార సంభవము - నన్నెచోడుడు
2. — పింగళి లక్ష్మీకాంతం, ఆం. సా. చ. పుట - 33.
3. సారస్వత వ్యాసములు - ప్రథమ సంపుటం - జి. వి. సుబ్రహ్మణ్యం గారి పీఠిక.

## మార్గ - దేశి పదప్రయోగం

తెలుగులో మార్గ - దేశి సంప్రదాయాలకు సంబంధించి విమర్శకుల్లో ఇప్పటివరకూ స్థిరపడ్డ అభిప్రాయాల ధోరణీ సారాంశమూ ఇది.

అయితే నన్నెచోడుడు తన కవితలో జాను తెనుగు పాలు కొంచెం ఎక్కువగానే ప్రయోగించినా నన్నయ కవితా ధోరణిలోని తత్సమ భూయిష్టమైన భాష అదే ప్రమాణంలో వాడి ఉండకపోలేదు. నన్నయభట్టు సంస్కృత వృత్తాలకు తోడు దేశ భాషా ఛందస్సులైన సీసం, ఆటవెలదీ, తేటగీతీ, తరువోజా, మధ్యాక్కరా, అక్కర భేదాలు విడివిడిగానే ప్రయోగించినప్పటికీ, నన్నెచోడుడు మాత్రమే దేశి కవితారీతిని అనుసరించినవాడనీ, నన్నయ అనుసరింపలేదనీ భావించడం బొత్తిగా పొరపాటు.

పదాలూ పాటలతో కూడిన దేశి కవిత ఎంతో నన్నయ్యకు పూర్వమే దేశంలో వ్యాప్తిలోఉంది. నన్నయ్యకు పూర్వం శాసనాల్లోకూడా దేశీ ఛందస్సే ఉంది. కాని సంస్కృత వృత్తాలు కనబడవు. సంస్కృత సాహిత్య లక్షణానుసారంగాతద్వృత్తాల నవలంబించి తత్సమ పద బహుళమైన భాషలో కవిత్వం చెప్పిన మొదటి కవి నన్నయ. కావుననే అతడు మార్గ కవితా పద్ధతి నవలంబించినవాడు అగుచున్నాడు.[1]

## మార్గ-దేశి లక్షణ క్రమపరిణామం (సంగీత సంప్రదాయానుసారం)

వైదికోత్తర సంస్కృత మహా కావ్యాల (లౌకిక సాహిత్య) యుగంలో దేశంలో రామాయణాది ఆఖ్యానగానం ద్వారా వ్యాప్తిచెందీ, ప్రచారంలో ఉన్నది గాంధర్వ సంగీతమనీ, అదే మార్గీ లేక మార్గ సంగీతమనీ నిస్సందేహంగా సిద్ధాంతీకరించవచ్చు.

మతంగుని 'బృహద్దేశి' వచ్చేవరకూ దేశీ పద్ధతి సంగీతానికి శాస్త్ర గ్రంథ ప్రవేశమూ మార్గానులక్షిత గౌరవమూ రాలేదు.

---

1. కుమారసంభవ పీఠిక - కోరాడ రామకృష్ణయ్య.

"గాంధర్వం మార్గః! గానంతు దేశీత్యవగన్తవ్యం!
అనాది సంప్రదాయ మిత్యనేన గాంధర్వం (మార్గ)
వేదవ దపౌరుషేయ మితి సూచితం భవతి
గానంతు (దేశీ) వాగ్గేయకార పరతంత్రత్వాత్
పౌరుషేయమేవ!"[1]

సామవేదంనుండి సంగృహీతమై బ్రహ్మచేత సృష్టింపబడుటచేత సంగీతం మార్గ సంగీతం లేక గాంధర్వ సంగీతం వేదంవలే అపౌరుషేయం. అది లౌకిక మైంది కాదు. వాగ్గేయకార పరతంత్రత్వాత్ దేశి సంగీతం లేక గానం పౌరుషేయం.

దీనిని బట్టి తేలిన నిర్ధారణలు-

సాహిత్యపరంగా గానీ, నాట్య పరంగాగానీ, సంగీతపరంగాగానీ మార్గ-దేశి శబ్దాల అర్థం - మార్గ అంటే సంస్కృత సంప్రదాయమనీ, దేశి అంటే ప్రాంతీయ భాషా సంప్రదాయమనీ గ్రహించాలి.

నన్నయభట్టు, నన్నెచోడాదుల తెలుగు కవిత దేశి కవితేగానీ మార్గ కవిత కాదు. సంస్కృత కవితయే మార్గ కవిత. సంస్కృత నాటక సంప్రదాయానికి చెందిన నాట్యమంతా మార్గ, దేశ భాషా రూపకాలకు వినియోగించేది దేశి.

ఈనాటి త్యాగరాజాది వాగ్గేయకారుల సంగీతం "అభిజాత" దేశి సంగీతం లేదా పరిణత దేశి సంగీతం. ఆయా ప్రాంతీయ భాషలకు చెందిన సంగీతం ఆ ప్రాంతాలకు దేశి.

## సాహిత్యంలో సంగీత ప్రసక్తి

జన బాహుళ్యంలో సాహిత్యానికి లభించిన గౌరవాదరణలు సంగీతానికిగానీ, నృత్యానికిగానీ లభించలేదు. దానికి బహుశః కొందరు సంగీత నృత్యకారుల నియమ రహిత ప్రవర్తన ఒక కారణం కావచ్చు. అందువల్ల

1. సంగీత రత్నాకరః - కల్లినాథ వ్యాఖ్య.

నేమో నటగాయక వార్ధుషికాదులు పంక్తిబాహ్యులనే స్మృతి వాక్యం వచ్చింది. పాటగాళ్ళు, ఆటగాళ్ళంటే జనసామాన్యంలో నిర్లక్ష్యభావం ఉండేది. సాహిత్యంలో ఒక ప్రత్యేకతంటూ లేకపోయినా సంగీతాది కళలు నిష్ప్రయోజనం మాత్రం కాలేదు. వినోద సమయాల్లో, రాజసభల్లో, ఉత్సవ సమయాల్లో మాత్రమే నట గాయకులు కనిపిస్తారు. సామాన్య జనులు వినోదార్థం ఉపయోగించే అసంస్కృతమైన భాషతో, లక్షణబద్ధంకాని సంగీతంతో యక్షగానాదులు ప్రదర్శించేవారనీ, పాల్కురికి సోమనాథుని కాలం నాటికే ఉన్నాయనీ సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. (12 వ శతాబ్దం).

"ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవముదులు కాచనట్లాడు"

....    ....    ....    ....
....    ....    ....    ....[1]

"జతులు నాడుచుఁ దాళగతుల కాడుచును
శ్రుతులఁ గూడుచు నేలఁ ద్రొక్కనోడుచును"

....    ....    ....    ....
....    ....    ....    ....[2]

"వెండియు శివు బహువిధ చరిత్రముల
ఖండగతి నాటకంబు లాడుచును
....    ....    ....    ....
....    ....    ....    ...."[3]

1. పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - 436 పుట.
2. పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - 438 పుట.
3. పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - 443 పుట.

వేములవాడ భీమకవి శాపం వల్ల రాజ్యాన్ని పోగొట్టుకున్న కళింగ గంగు, భీమకవి అనుగ్రహంతో వీధి భాగవతుల్లో చేరి నాటక ప్రదర్శన చేస్తూ, మారువేషంలో నాటక మధ్యంలోనే శత్రురాజును చంపి రాజ్యం తిరిగి పొందాడని ఐతిహ్యం.

ఆట పాటలు ఈ విధంగా ప్రయోజనాన్ని సాధించుకోడం కోసం ఉపయోగపడ్డాయనే దీనివల్ల తెలుస్తోంది.

ఆదికాలం నుండి సాహిత్యాది లలితకళలు మత ప్రచారానికే ఉపకరించాయి. కేవలం మత ప్రచారానికే కాక రాజ్య లాభం కోసం కూడా ఈ లలితకళలు ఉపయోగపడ్డాయనడానికి చరిత్రలో ఉదాహరణలు చూపించవచ్చు. అంతేకాదు పూజా పురస్కారాల్లో శివతాండవాది నృత్యాలు చేసినట్లుగా పాల్కురికి సోమనాథుడు వర్ణించాడు.

## సందర్భం

తాండవమూర్తి అయిన ఏకామ్రనాథుడు రోగగ్రస్తుడై చికిత్స వల్ల ప్రయోజనం లేక పోవడంతో శివుని ప్రార్థించేడు. శివుడు ప్రత్యక్షమై తాండవ స్వరూపం ఇలా వివరించాడు :

"ఇది తాండవకార మెట్టులంచేని
ముదమున నాహ్యాభిముఖుడై నిల్చి
.... .... .... ....
.... .... .... ....
గ్రీడ దత్రిలజతి గీతముల్ వాడ
నాడుదు ప్రమధులు సూడదాండవము
.... .... .... ...."[1]

---

1. పండితారాధ్య చరిత్ర

తాండవ స్వరూపం కవి తానుగా చెప్పక శివునిచేత వివరింపజేయడం విశేషం. లయబద్ధంగా డమరుకం వాయిస్తూ సర్వాంగాలనూ కదిలిస్తూ అభినయం చేయడం చాలా విపులంగా వివరించాడు. ఇక్కడ మత ప్రచారమే ప్రయోజనం.

కావ్య ప్రయోజనం రసానందం అయితే కావ్యగత కథాప్రయోజనం సాధించాయి సంగీత నాట్య కళలు.

## సందర్భం

విరాటరాజు కొలువులో నాట్యాచార్యునిగా చేరి, బృహన్నల తనకు వచ్చిన వివిధ నృత్యాల పేర్లు పేర్కొంటాడు.

"ఒండు పనులకు సెలవు లేకునికి జేసి
యభ్యసించితి శైశవమాది గాగ
దండ లాసక విధమును గుండలియును
ప్రేంఖణంబు తెలంగును ప్రేరణియును"[1]

అజ్ఞాతవాసం సంపూర్ణం కావడానికి మునుపు ఊర్వశి ఇచ్చిన శాపాన్ని వరంగా మార్చి, నృత్యాన్ని ఆలంబనగా జేసుకొని అర్జునుడు తన ప్రయోజనం సాధించుకున్నాడు.

ఇదే విధంగా పూర్వ కావ్యాల్లో అక్కడక్కడా సంగీత నృత్య వాద్య ప్రసక్తి కనిపిస్తుంది.

సాహిత్యంతో బాటు సంగీతం కూడా సమాన గౌరవం శ్రీనాథుని యుగం నుండే పొందిందని అనుకోవచ్చు. శ్రీనాథుని కాలం నుండే రాజులు తమ తమ ఆస్థానాలలో సమస్త శాస్త్రాలు అభ్యసించిన పండితులతో బాటు సంగీతజ్ఞులను కూడా పోషించినట్లు అవతారికల్లో కవులు పేర్కొన్నారు.

సంగీతం, నాట్యం, వాద్యాలు రాజులు ఏ సందర్భాల్లో ఏ యే ప్రదర్శనలు ఔచిత్యవంతంగా ప్రదర్శించడానికి అనుమతించేవారో వివరించిన నిశిత పరిశీలకుడు శ్రీనాథుడు.

---

1. తిక్కన భారతం - విరాటపర్వం

శ్రీనాథుడు తనకున్న సంగీతజ్ఞత ఒక్కొక్క కావ్యంలో ఒక్కొక్క విషయంగా ప్రసక్తి నిచ్చి ప్రకటించుకున్నాడు.

## సందర్భం

శృంగారనైషధం అవతారికలో

వేమారెడ్డి మంత్రి మామిడి సింగనను ప్రశంసిస్తూ అతని సభలో ఉన్న వారిలో-

"మృదుమధురచిత్ర విస్తర కవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును, పతంజలి కణాదాక్ష చరణ పక్షిలాది శాస్త్ర సిద్ధాంత కమల వనహంసులగు విద్వాంసులును, భరత మతంగ దత్తిల కోహలాంజనేయ ప్రణీత సంగీత విద్యారహస్య విజ్ఞాన వైజ్ఞానిక స్వాంతులగు కళావంతులును .... .... .... .... .... ...."[1] ఉన్నట్లుగా వివరించాడు.

శ్రీనాథుని కాలానికి శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం, జాయపసేనాని నృత్త రత్నావళి మొదలైన శాస్త్రాలు పఠించి, జీర్ణం చేసుకోడం జన వ్యవహారంలో ఉంది. ఇది ఒక ముఖ్య కారణం కావచ్చు. ఆ విషయం పై వచనం ద్వారా తెలుస్తోంది.

ఉత్సవ సమయాల్లో, సంగ్రామ యాత్రల్లో, వివాహాది మంగళకార్యాల్లో ఉపయోగించే అంగ ప్రత్యంగ వాద్యాలు శ్రీనాథుని కావ్యంలో దర్శనమిస్తాయి.

ఈ వాద్యాలు సందర్భోచితంగా రసభావానుగుణంగా ప్రయుక్తమౌతాయి.

బాలచంద్రుని యుద్ధంలో మలిదేవ మహారాజు, బ్రహ్మనాయుడు మొదలైనవారు కార్యమపూడి యుద్ధరంగానికి బయల్దేరి వెళ్ళేటప్పుడు సైనిక పటాలం ఉపయోగించిన ఆయుధాలతోబాటు వాద్యాలు కూడా వివరించాడు. (పల్నాటి చరిత్ర)

---

1. శృంగార నైషధం - ప్రథమాశ్వాసం.

"కాహళ వంకిణి కాలి కొమ్ములును
శంఖ సమూహంబు సన్నాయి జోళ్ళు
మురళి చయంబును ముఖ వీణ వితతి
నగరలు తప్పెటల్ నయమైన డోళ్ళు
తమ్మటమ్ములు నెంచదగు వీరణములు
ఘనమైన ఝంజలు కనక తప్పెటలు
జేగంటలును మరి చిరుగంట చయము
ఘనమైన మ్రోతచే గగనంబు గప్ప
.... .... .... ....
.... .... .... ..."[1]

కాహళ, వంకిణి, కాలి కొమ్ములు, శంఖాలు సన్నాయి మురళి ఇవన్నీ గాలి వాద్యాలు. వీటికి అనుగుణంగా చర్మ వాద్యాలు నగారా, తప్పెట,డోళ్ళు, వీరణాలు గంటలు తాళలయలను చూపిస్తూ సహకార వాద్యాలుగా ఉపయోగించేవి. భీకర శబ్దాన్ని చేస్తూ యుద్ధోత్సాహాన్ని కలుగజేసే వాద్యాలు ఉపయోగించేరని చెప్పవచ్చు.

నలగామరాజు సభలో విద్యా వినోదాలు జరిగే పద్ధతి గమనించదగినది. ఎక్కడైనా సంగీత సభల్లో నేడు గాయకునితో బాటు మృదంగ వాయులీనాదులు ప్రధాన వాద్య సహకారంగా కనిపిస్తుంది. పైగా గాయకుని శ్రుతి ననుసరించి తమ తమ వాద్యాలకు శ్రుతి చేసుకోవడం ఇప్పటి పద్ధతి. మరి అప్పటి పద్ధతి-

"వింతగా గాయకుల్ వీణల బూని
తంత్రులు బిగియించి తగుశ్రుతి బెట్టి
సరిగ మేళములైన స్వరసప్తకంబు
ఆరోహణావరోహణ భేదములను
బహురాగ సంప్రాప్తి పట్టుగా జేర్చి

1. వల్నాటి వీరచరిత్ర - పుట 4 - వరుస 141 నుండి

.... .... .... ....

.... .... .... ....

జంత్రంబు గాత్రంబు జంటగావించి

చెలగి ఎండిన చెట్లు చిగురించునట్లు

పాడిరి తమ తమ ప్రావీణ్య మెసగ

.... .... .... ...."[1]

ఇందులో గాయకులే వీణలకు తంత్రులు బిగించి శ్రుతి చేశారుట. ఇక్కడ ఉపయుక్తమైన వీణ రామామాత్యుని సర్వరాగమేళ వీణ కాదు. ఏ రాగం ఆలపిస్తారో ఆ రాగ ప్రదర్శనలో వచ్చే స్వరాలు ఆరోహణావరోహణలను శ్రుతి చేసుకొనే ఏకరాగ మేళ వీణ.

ఈ సప్త స్వరాల్లో ఏ రాగం ఆలపిస్తారో ఆ రాగ ప్రస్తారానికి తగినట్లు స్వరాల్ని మార్చుకునేందుకు వీలుగా చేసుకున్నారుట. వారు సంపూర్ణ రాగం గాని, ఔడవ రాగం గాని, షాడవ రాగం గాని, ఏ రాగాలాపన చేయాలను కున్నా తదనుగుణంగా స్వర స్థానాలను నిలుపుకోవాలి. అలా వీణలు శ్రుతి చేసుకొంటే "ఘనతరాలంకార గతివరంపర" అంటే దశవిధ గమకాలతో రాగం రంజితమౌతుంది. ఆయా రాగ సంబంధి జీవ స్వరాలపై మూర్ఛన, కంపితం, లీనం, ఆహత, ప్రత్యాహత, గుంఫితాది గమక భేదాలు స్పందించడం వల్ల గానంలో ఒక విధమైన శోభ కలుగుతుంది. అదే అలంకారం. ఆ విధంగా ఆలపించిన వారి పాటలో తమ ప్రావీణ్యాన్ని కనబరచటమే కాక, ఆ మాధుర్యంతో ఎండిన చెట్లు చిగురింపజేశారని వర్ణించాడు.

గాన కచేరి అయిం తరువాత అంశం నృత్యం. కంజలోచన అనే నాట్య కర్తె అసలు సిసలైన సంప్రదాయానుసారిణియై (నాట్య శాస్త్ర సంప్రదాయంతో) నాట్యాన్ని చేసిందట.

ఈమె నాట్యం జాయప సేనాని నృత్త రత్నావళిలో లో వర్ణించిన తీరుకు లక్ష్యం అనవచ్చు.

1. పల్నాటి వీరచరిత్ర - పుట 17 - వరుస 158 నుండి

అన్ని హంగులూ ఏర్పరచుకొన్న నాట్య బృందం కంజలోచన నాట్య బృందం. రెడ్డి రాజుల కాలంలో కుమారగిరి రెడ్డి ఆస్థాన నర్తకీ అతనికి ప్రియురాలూ అయిన లకుమాదేవి నాట్యంలో గొప్ప ప్రవీణ. కుమారగిరి రెడ్డి రాసిన నాట్య శాస్త్రానికి లక్ష్యంగా ఈమె ప్రదర్శన జరిపేదట. ఈవిధంగా రెడ్డి రాజులు నాట్యాన్ని బాగా పోషించడం, అభిమానించడంవల్ల ప్రసిద్ధి కెక్కింది నాట్యకళ.

ఇంద్ర సభ అన్నట్లున్న ఆ సభలో నాట్యమేళంవాళ్ళు వచ్చి యథా విధిగా రాజుకు మొక్కగా, నలగామ రాజు నాట్యారంభానికి సెలవిచ్చాడట.

నాట్య బృందం నివేశించి ఉన్న తీరు జాయపసేనాని నృత్త రత్నావళిలో చెప్పిన తీరుకీ సరిపోతుంది.

"వరమృదంగము లెస్స వాయించు మేటి
కుడి భాగమున యందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటి దిశను
నిలిచిరుత్సాహంబు నేరుపుమీర
ముఖవీణ వాయించు ముఖ్యుడొకండు
రాగమాలాపించు రమణు లిద్దరును
నిండు వేడుకతోడ నిలిచిరి వెనుక
.... .... .... ....
.... .... .... ...."1

నృత్తరత్నావళిలో బృంద విన్యాసం ఇలా ఉంది:

"పాత్రస్య దక్షిణే పార్శ్వే ముఖరీ స్యాన్మఖేస్థితః
క్రమాన్మార్దంగి కాస్తస్య తిష్ఠేయుర్వామత స్తతః
హుడుక్కా శాంఖికా (కో?) దేశీపట హీ కంటాధరః
కాహలా వాదకాః కాంస్యతాలినశ్చ యథాక్రమమ్

1. పల్నాటి వీరచరిత్ర - పుట 18 - పంక్తుస 176 నుండి.

తిష్ఠేయుః పృష్ఠతస్తేషా మేవం ప్రతిపన్ముఖర్యపి
తస్యాను వాదకాద్యాశ్చ భవేయుర్వామ పార్శ్వతః
తిష్ఠేతాం ముఖ్య గాయిన్యౌ పాత్ర పశ్చాత్త్వ భాగతః
ఏతయోః పార్శ్వ యోస్తాలధరాః ప్రౌఢాః కళాదిషు"1

శ్రీనాథుని నాట్యకత్తెకు పిల్లనన్నాయిలాంటి ముఖవీణకూడా వాద్యమేళంలో సహకరించింది. కొద్ది చిన్నచిన్న భేదాలతో ఉన్నా, విన్యాసం మాత్రం రత్నావళి పద్ధతిలోనే ఉంది. నాట్యకత్తెకు ఉండవలసిన లక్షణాలు కంజలోచనకు ఉన్నాయి.

నాట్యకత్తెకు రూపం, యౌవనం, లావణ్యం, నృత్య విద్యతో బాటు అంగ, ప్రత్యంగాలూ లాస్యాంగాలూ ఇవన్నీ కాక, మార్గ-దేశి పద్ధతులన్నీ తెలిసి ఉండాలి. సమస్త లక్షణ సమన్వితయైన ఆమెను శ్రీనాథుడు ఇలా వర్ణించాడు:

"మదను పట్టపుదంతి మంజులవాణి
భరత శాస్త్రోచిత బహు రాగములను
గరిమతో నేర్చిన కంతు బాణంబు
వచ్చి సభాసదుల్ వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు .... .... ....
.... .... .... ....2"

కంజలోచన ఉపక్రమించింది. ఆ రోజు ఆమె నాట్యంలో ఆమెకు వచ్చిన నాట్య పద్ధతులు మార్గ-దేశి భేదాలన్నీ ప్రదర్శించిందని వివరించాడు. ఆమె నాట్యం చూసి రంభాద్యప్సరసలు సిగ్గుపడ్డారట.

మార్గ పద్ధతిలో సంగీత, నృత్యాలు ఏమైనా మార్పు చేయటానికి వీలు లేదు. అంత సొబగూ ఉండదు. కొత్తదనమనేదాన్ని ఆహ్వానించే జనావళి ఆమోదం పొందాలంటే, మార్గ పద్ధతి ప్రభావంతో విడివడి దేశ్యమైన దేశి

1. నృత్త రత్నావళి - బృంద విన్యాసం.
2. పల్నాటి వీరచరిత్ర - పుట 18 - వరుస 184 నుండి.

సాహిత్యం, స్వరం, గమకం, రాగం, తాళంతోబాటు కూర్చిన ప్రబంధానికి నాట్య రీతిని కూడా కల్పించి తామై ప్రదర్శించారు. అంగహారాదులు, బహువిధ స్థానకాలతో మార్గ - దేశి సంప్రదాయ మిశితమైన తాండవాన్ని సందర్భానుసారంగా కూర్చి ప్రదర్శించారు.

ఆనాటి సంగీతకారులు, వాద్య, నృత్యాలను కూడా క్షుణ్ణంగా అభ్యసించే వారని దీనివల్ల విదితమౌతోంది. రాగాన్ని కూర్చడంలో కూడా నేర్పు ప్రదర్శించారు. రాగం, రాగ భావం, రసం, సందర్భం, వృత్తీ, రీతీ అన్నీ తెలిసున్న విద్వాంసులైతేనే ఆ ప్రయోగాలు చేయగలరు. ఈ విషయాలన్నీ తెలిసిన విజ్ఞుడు శ్రీనాథుడు.

అనాగరికుడు, ఏమీ తెలియనివాడు జానపదుడని సర్వసాధారణంగా లోక వ్యవహారం. లౌక్యం ఏమీ తెలియనివాడు జానపదుడు కావచ్చు. కానీ అతనిదైన వృత్తి వ్యవహారాల్లో మాత్రం అంతటివాడు లేనట్లుగా కనబడుతాడు. ఆటువంటి కేవల జానపదుడయిన పాముల మెంగడు ఒకడు శ్రీనాధుని క్రీడాభిరామంలో మనకు దర్శనమిస్తాడు.

"వెడలి పశ్చిమ దిశ నాల్గు గడియలంత
ప్రొద్దు గలుగంగ నడువీధిఁ బోయివోయి
కేళిసఖుఁడును దా నాలకించిచనియె
నాగసరముల మ్రోత యన్నాగరికుఁడు."1

"నాగస్వర సుషిరసర
న్నాగ వరాళ్యాది వివిధ నానా రాగ
ప్రాగల్భ్య ప్రకట ఫణా
భోగములై యాడ జొచ్చె భోగీంద్రంబుల్"1

1. క్రీడాభిరామం-210 పద్యం.

"కడగోరఁ దీర్చిన కస్తూరి గీర్బొట్టు నెక్కు సక్కెంబుగాఁ జక్క మెఱయ
నడ్డంబు ద్రికటంబునై యురః స్థలమున గంధసార స్థాసకములు మెఱయ
జాల సిగ్గులు గుల్కుపాల తెక్కుల కుచ్చు వామ కర్ణంబుతో వక్కళింపఁ
బెనచి వెండ్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన ప్రాఁత చంద్రిక వన్నె పాగయమర"

జన్నిదంబుగఁ బెను పాము సవదరించి
యంఘ్రి కటకంబు ఘల్లు ఘల్లనుచు మొరయ
నాహి తుండికగరళ విద్యాధిరాజు
వచ్చెఁ బాముల మెంగడు వదరులాడు[2]

పూత్కార పవనంబు పూరించు పుక్కిళ్ళు మునిడి పండులతోడ ముద్దుఁగురియ
సందటి సంకు పూసల సద్దుకటుతుంబి నాద స్వరోజ్జృంభణముల నడఁ ప
నేడు రంధ్రమ్ములు నిరుకేల వ్రేళ్ళను వివృతిసంవృతి లీల విస్తరింప
నాలాపతాళాంత రాంతరంబుల యందు విక్కను శబ్దముల్ చొక్కటముగ"

నాగ సింధు ప్రభేద నానా వరాట
రాగ గంధర్వలహరికా రంభణముల
మిహి పదం బుల బాముల మెంగఁ డూఁదె
భోగిరాజులు నర్తింప నాగస్వరము[3]

అతడు "నాగస్వర సుషిరం"లో నాగవరాళి భేదాలు వాయిస్తూంటే భోగీంద్రాలు ఆడుతున్నాయిట.

"సుషిర" అంటే వేణువు. భరతనాట్య శాస్త్రంలో వేణు భేదాల్లో ఉన్నది. కానీ పాముల వాళ్ళు తెచ్చే సుషిర ('బూర' జన వ్యవహారంలో) సొరకాయకు ఒకవైపు రెండు గొట్టాలుండి రెండో చివర ఊదేందుకు వీలుగా పీకలుంటాయి. రెండు గొట్టాల్లో ఒక దానికి సప్తస్వరాలకు ఏడు రంధ్రాలుంటాయి. రెండో దానికి శ్రుతికి మూడు రంధ్రాలుంటాయి. ఈ రకపు వాద్యాన్ని పాల్కురికి సోమన "భుజంగ వీణ"[4]గా పేర్కొన్నాడు. శ్రీనాథుని పాముల మెంగడి సుషిరా ఇదీ ఒకటే కావచ్చు.

---

1,2,3. క్రీడాభిరామం - 220, 223, 224 పద్యాలు
4. పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణము - పేజీ 443.

పద్ధతిలోనే నూతనత్వాన్ని సృజించి, ప్రకటించడం జరుగుతుంది. అందువల్ల వివిధ పద్ధతులేకాక జనరంజకం అనే ప్రయోజనం సిద్ధిస్తుంది. అలా ఆమె నాట్యం సుదీర్ఘంగా విరామం లేకుండా ప్రదర్శించి రంభాదులను కూడా ఆశ్చర్యంలో ముంచెత్తిందట.

నాట్య బృందంలో అందరూ (వాద్యకారులు) నిలబడి ఉన్నారని శ్రీనాథుడు వ్రాశాడు. జాయప సేనాని వివరణలో కూర్చుని ఉన్నట్లు ఉంది. బహుశః అనుకూలతనుబట్టి మార్చి ఉండవచ్చు.

పల్నాటి వీరచరిత్రలోని నాట్య వివరణ శ్రీనాథుని నిశిత పరిశీలనలో చదువరులకు దృగ్గోచరమవుతోంది.

"శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారన్నట్లు సాహిత్యంతో బాటు సంగీతం కూడా ఆకళింపు చేసుకోవాలంటే రెంటియందు కొంత పరిజ్ఞానం అవసరం."1

గాయకులున్నారనీ, నృత్యప్రదర్శన జరిపారనీ వివరించినట్లే ఒకేచోట వాద్యాలను కూడా కలిపి తూర్య త్రయాన్ని ప్రదర్శించాడు శ్రీనాథుడు.

## సందర్భం :

కాశీ ఖండంలో గీతవాద్య సమ్మేళనంతో శ్రీమహాదేవుని పూజించే సందర్భం.

కపర్దీశ్వర ప్రభావ కథనంలో -

"ఒక్కనాడు మధ్యాహ్నవేళ నవ్వాల్మీకి విమలోదకుండంబునం గ్రుంకువెట్టి యనంతరంబ యాపాదమస్తకంబుగా భస్మోద్ధూళనంబు సేసి రుద్రాక్షమాలికలు ధరించి కపర్దీశ్వర మహాదేవు సమ్ముఖంబునం బంచాక్షరీ పంచ బ్రహ్మ శత రుద్ర్యాది మంత్రంబుల ధ్రువమఠలంబక రాసకాదుల నేలాకర రేంకి (తేంక) వర్తన్యాదులును సూత శుద్ధ సూళ భేదంబులు వెడవెడ ఝుం ఝుం టం టం ప్రధాన నానాస్తోభాక్షరంబులు సరిగమాది

1. భారతీ కళాతరంగిణి - వ్యాస సంపుటి - అభినందనలో వాక్యం.

స్వరంబులు దివ్య స్తుతి పదంబులు త్రిపుర విజయ దక్షాధ్వర ధ్వంసాది బిరుదంబులు శంఖ మురజాది వాద్యంబులు ధేవంబులు సంఘటించి విస్ఫురి తాందోళతంబులు ద్రిభిన్నాది గమక భేదంబులతోడ నయ్యయి ప్రయోగంబుల నాహత ప్రత్యాహతంబులు పుట్టించుచు, జంచత్పుటచాచపుట షట్పితాపుట (త్రి) సరద్వేష్ట కఉద్ఘట్టితాది తాళంబుల ఘంటారవ శంకరాభరణాది (గ్రామంబులను) రాగరాగాంగ భాషాంగ క్రియాంగోపాంగాది దేశి రాగంబులను సంఘటించి దత్తిల కోహల భరత మతంగ నందికేశ్వరాది మతానుసారంబున వివిధ ప్రబంధంబుల నిర్మించి వానికి బహువిధ స్థానక మండల చారికా చరణాంగహార రేచక ధవళక నటనాది శిరోభావ చక్షుర్భావ చాలనంబులు మెఱయ దేశీ మార్గ లాస్య తాండవంబులు పరిఢవించుచు, నిట్లు తానతూర్య త్రయంబు ననుసంధించుచుఁ గొంత దవ్వువ్విరూపాక్షునిఁ జాక్షుషంబైన యోగంబు యోగంబున యజించు చుండె. అయ్యవసరంబున"[1]

ఇందులో మహాదేవుని స్తుతిస్తూ ఆయన మీద పదాలు, శివుని విజయాలు, దక్ష యజ్ఞ ధ్వంసం మొదలైన వస్తువుగా గల ప్రబంధాలు సరిగమాది స్వరాలతో రచించారు. దత్తిలుడూ, కోహలుడూ, ఆంజనేయుడూ, భరతుడూ, మతంగుడూ, నందికేశ్వరుడూ మొదలైన వారి శాస్త్రానుసారంగా ప్రబంధాలను స్వరపరిచారు. ఆ ప్రబంధాలకు మార్గ-దేశి రీతిలో మార్గ - దేశి తాళాలను కూడా సందర్భోచితంగా కూర్చారు. రాగాలను **జాతులనీ, గ్రామాలనీ,** ఒకప్పుడు వ్యవహరించేవారు. శివ సంబంధి మార్గ సంగీతానికి కొంచెం ముందు ఈ వ్యవహారం ఉండేది. అది రాను రాను రాగం అని స్థిర నామం పొందింది. శ్రీనాథుని కాలంలో బహుశః రాగానికి గ్రామనామం కూడా వ్యవహారంలో ఉండి ఉండవచ్చు. అందుకే ఘంటారవం శంకరాభరణాది (గ్రామంబులను) రాగ...అని అన్నాడు. ఈ రెండూ పురాతన రాగాలే.

తరువాత రాగాంగ, భాషాంగ, క్రియాంగ, ఉపాంగాది దేశిభేదాలలో ప్రబంధాలను స్వరపరిచారు. వాటికి మార్గతాళాలైన చచ్చత్పుట, చాచపుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టక, ఉద్ఘట్ట అనే తాళాలను మాత్రమే ఉపయోగించారు.

1. కాశీఖండం - కపర్దీశ్వర కథనం - 40 వ వచనం.

కస్తూరి బొట్టు పెట్టుకొని పక్షి రెక్కల తలపాగా పెట్టుకొని ఆ పాముల మెంగడు అచ్చంగా జానపదవేషం వేసుకున్నాడు. అతడు సుషిరం వాయించే పద్ధతి ఇలా వివరించాడు:

"పూ" అని గాలి వదుల్తూ పుక్కిళ్ళు ఉబ్బి ఉండేటట్లు ఊదుతున్నాడు. ఏడు రంధ్రాలను రెండు చేతుల వేళ్ళతో పట్టుకున్నాడు. తెరుస్తూ మూస్తూ ఊదుతూ మధ్యలో "ఏక్" అనే శబ్దాన్ని చేస్తున్నాడు. ఇప్పటికీ నాగస్వరం వాయించే విద్వాంసులు రాగాలాపన చేసేటప్పుడు మధ్యలో ఆపినప్పుడు ఆ ధ్వని చేయటం కనబడుతుంది. ఇతడు నాగవరాళి, సింధువరాళి, నాగస్వరావళి, పంతువరాళి, పున్నాగవరాళి, అసారవరాళి, సామవరాళి, ప్రతాపవరాళి మొదలైన రాగాలు అద్భుతంగా వాయించేసరికి భోగిరాజులు తన్మయత్వంతో నర్తించాయట.

ఈతనికి నాగస్వర వాద్యపు మెళకువలన్నీ తెలిసి ఉండడం వల్లనే ఇన్ని సంప్రదాయ ప్రవృద్ధమైన రాగాలను వాయిస్తూ, స్వరస్థానాల్ని గమక రీత్యా వ్రేళ్ళను కదుపుతూ వాయించగలిగాడు. శాస్త్రజ్ఞానం ఉన్నవాళ్ళు ఆ దృశ్యాన్ని చూశారు కాబట్టీ, అనాగరకుడైనా పాముల మెంగడు జానపద వాద్యమైన సొరకాయ బుర్రపై నాగరకులను మెప్పించగలిగేటట్లు లక్షణ బద్ధమై వృద్ధిచెందిన రాగాలను వాయించగలగటం చాల అపురూపమైన విషయంగా వివరించగలిగారు.

ఏది ఏమైనా ఇటువంటి విషయాన్ని వివరించిన ఖ్యాతి శ్రీనాథునికి దక్కింది.

ప్రబంధ యుగం ప్రవేశించేసరికి సంగీతాది కళలు కళలుగా విశిష్ట స్థానాన్ని పొందడమే కాకుండా సంగీత శాస్త్రిలూ, సంగీత రచనలూ వెలిశాయి.

అష్టదిగ్గజాలను పోషించి సాహితీ సమరాంగణ సార్వభౌము డనిపించుకున్న శ్రీ కృష్ణదేవరాయలు సంగీతజ్ఞుడు. సాహిత్యంతోబాటు సంగీత నృత్య కళలను సమాదరించాడా రాజు.

కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో సంగీతవాద్య ప్రస్తావన ఉంది.

విష్ణుచిత్తుని స్వపుర ప్రవేశంలో–

ఇట్లైదుర్గ్యాని పట్టి పవిత్ర భగవత్ప్రసాద తీర్థంబులు పాయనంబులుగా ప్రణామంబు లాచరించి లేచి, ప్రాంజలులై, ధీర్మ పరికర్మ పర్మితంబగు బ్రహ్మ రథంబున సద్భాగవతంసంబు నునుచుకొని పోవు సమయంబునఁ, బరస్పర సమేతంబులగు పౌర జానపద జనంబులు గలసి మెలసి నడచునెడ, మృదంగంబు పాంగం బావజంబు దండె తాళంబురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖ వీణె వాసె గ్రోలుడోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబుడుక్కడక్కి చక్కి చుయ్యంకి లోనగు నసంఖ్యాత వాదిత్రత్రితయ పరంపరలు మొరయ ....

.... .... .... .... .... ... ...

... ... ... ... ... ..., ... ...

తొంటికంటె శత గుణంబుగా భాగవత పూజాప్రవణుండై యుండె నంత.[1]

ఇందులో ఆంధ్ర, కన్నడ, తమిళ సంప్రదాయాలకు సంబంధించిన దేశి వాద్యాలు కనిపిస్తాయి. ఆలయాల్లో, శుభసమయాల్లో, గృహాలలో, ఇతరత్రా ఉపయోగించే వాద్యాల ప్రస్తావన ఇందులో ఉంది.

మాల దాసరి కథలో-

పేరుకొనగాని కులం గల దాసరి శ్రీ మహావిష్ణు భక్తుడు. బ్రహ్మవేళల వచ్చి మంగళ కైశికిలో భక్తిప్రపత్తులతో భగవన్నుతి చేస్తాడట.

ఆ చండాలేతరుడు పులకితాంగుడై చాండాలికను మీటుతూ భక్తి పారవశ్యంతో తాండవ మాడుతూ పాడుతాడుట.

అతని వాద్యాల ప్రసక్తి ఇక్కడ ఉంది:

"చమురైన తోల్కుబుసంబు టెక్కియును ని
తడి శంఖ చక్ర కుండలముల మర

1. ఆముక్తమాల్యద - విష్ణుచిత్తుని స్వపుర ప్రవేశం - చతుర్థాశ్వాసం - 35 వచనం.

... ... ... ... ... ...
... ... ... ... ... ...
మత్పాద రక్షయ మావు పెన్వెఱకఁ గు
ట్టిన యోటి తిపిరి దండెయును మెఱయు
జిట తాళములు సంకపుటిక నొక్కొక మాటు
గతిరయంబున దాకి కలసి మెరయ"1

సింహగిరి నరహరి వచనాల రచయిత ఉపయోగించినట్లుగానే దండే, చిటి తాళాలూ ఈ దాసరి ఉపయోగించాడు.

ఆ దాసరిని ఒక బ్రహ్మ రాక్షసుడు పట్టుకొని ఈ విధంగా అడుగుతాడు:

అనిన విని మాతంగుండా తెఱంగైన .... .... ....
.... .... .... .... .... .... ....
.... .... .... నీవు కైటభారిం బాడిన నేఁటి పాట ఫలంబు సజలంబుగా నాకిచ్చితేని బీభత్సకుత్సార్హంబగు నీ జన్మంబు వేఁగు .... ....
.... .... .... .... ... .... .... ....2

"సంగీత ఫలంబునఁ గో
సంగీ సగమైనఁ దయ పొసఁగ నీవే; మీన్
మ్రింగిన గ్రుక్క న్వారిధి
కింగొఱతయె? కొదయె విష్ణు కీర్తన కనినన్?"3

సంగీత ఫలమిచ్చి, శాప విముక్తి చెయ్యమనీ రాక్షసుడు దాసరిని కోరాడు. ఇక్కడ సంగీతం యొక్క గొప్పతనాన్ని వివరించాడు. ఆ ఫలం వల్లే శాపవిముక్తుడౌతాడా రాక్షసుడు.

---

1. ఆముక్తమాల్యద - షష్ఠాశ్వాసం - 6 వ పద్యం
1. ఆముక్తమాల్యద - షష్ఠాశ్వాసం - 59 వచనం
2. ఆముక్తమాల్యద - షష్ఠాశ్వాసం - 64 వచనం.

సంగీత ప్రశస్తిని ఈ విధంగా వివరించాడు కవి. తరువాత అష్టదిగ్గజ కవులలో అల్లసాని పెద్దనా, రామరాజ భూషణుల కృతుల్లో సంగీత ప్రస్తావన కనిపిస్తుంది.

మనుచరిత్రలో-

"వాలారుం కొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ వంట మింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెఁడుఁ బ్రభాతాయతావాతాహతా
లోలత్తంత్రుల మేళవింప గదవే లోలాక్షి! దేశాక్షికిన్"[1]

రాగానికి సరిపడా నిర్ణీత స్వరానికి మార్చడానికి వీలుగా కదిలే మెట్లు గల వీణ అప్పటి సంప్రదాయ వీణ. అదీగాక ఫలానా రాగం ఈ కాలంలోనే పాడాలనే నియమం కూడా ఉంది. కాబట్టే సాయంవేళ పాడే పాట రాగానికి సరిచేసిన తంత్రులు అలాగే ఉన్నాయి. ప్రభాత సమయంలో వీచే గాలి తరంగాల తాకిడికి నిన్నటి రాగ తంత్రులు మ్రోగుతూ ఉంటే ఉదయం పాడే దేశాక్షికి సారికలను మార్చమని వరూధినికి చెలికత్తెలు హెచ్చరించే సందర్భం ఇది. ఏ కాలంలో పాడవలసిన రాగాలకు ఆ కాలంలోనే ఆలాపన జరిగేదని స్పష్టమౌతోంది.

ఇక వసుచరిత్రలో రామరాజ భూషణుడు అప్పటి రాగాల విషయంలో హిందోళానికి ఉన్న స్వరాలకు రిషభ, పంచమాలు కలిపితే వసంతరాగం అవుతుందని రాగప్రస్తావన చేశాడు.

"అరిగా పంచమ మేవగించి నవలాలవ్వేళ హిందోళవై
ఖరి సూపంబిక జాత మాత్మరవ భంగ వ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవ వ్రత విధు ల్దాల్పందదీయ ధ్వనిన్
సరిగాఁగ్రై కొనియెన్ వసంతము మహా సంపూర్ణ భావోన్నతిన్"[2]

---

1. మనుచరిత్ర - తృతీయాశ్వాసం - 57 వ పద్యం.
2. [illegible] 130 [illegible]

మొదట ఋషభ పంచమాలు రెండూ కాక "సగమదని" అని ఐదు స్వరాలు కూడుకొన్న ఔడవ రాగం అయిన హిందోళ రాగాన్ని ఆలపించారు. ఇది 'అవ్వేళ' అంటే వసంత శిశిరాల మధ్య కాలంలో ఆలపించాల్సిన రాగం.

అలా పాడిన రాగంలో మళ్ళీ రిషభ పంచమాలు కలిపి వసంతాన్ని సరిగా సంపూర్ణ రాగంగా పాడారట.

కళాపూర్ణోదయంలో-

'జాంబవతీ, సత్యా, భోజకన్యా, శ్రీకృష్ణుల వద్ద నారదుని సంగీత శిక్షణ' అనే అంశంలో ప్రత్యేకంగా సూరన సంగీత శాస్త్రాల విషయాల్ని స్పష్టీకరించాడు.

"ప్రౌఢితో సరిగమపద నిస్వరంబుల
ప్రతి నియత శ్రుతి క్రమములెఱిగి
రాగ భేదముల వర్జ్యలు దొలంగించి
లయ తాల శుద్ధి నెంతయుఁ దలిర్ప
గ్రామ విశేష మూర్ఛన లేరుపడ మంద్ర
మధ్యమ తార సామగ్రి దనర
ధాతు మాతువులు గీత ప్రబంధము లందు
నసమాన లీలమై నతిశయిల్ల
... ... ... ...
... ... ... ...
నాత్మ గుణగానముల సేయ నచ్యుతుండు."1

మరోచోట సంగీతం మోక్షదాయకమనే విషయం చెప్పాడు.

నీ సంగీత విశేషా
భ్యాసము సఫలముగా, విష్ణు బరమేశ్వరున
త్యాసక్తి తోడ బాడుచు
వేసరక భజింపు మెల్లవేళల యందున్

1. కళాపూర్ణోదయం - ద్వితీయాశ్వాసం - 34 వ పద్యం

"ఆ దేవున కెంతయుఁ బ్రియ
మై దురిత వినాశహేతువగునిది" యని యే
నారదముని నామోక్షా
పాదిన్ వీణియ ధరించి పాడుచునెపుడున్"1

ఈ సంగీతమే అన్ని విద్యల్లో ఉత్తమమైన విద్య అనీ పురుషోత్తమునికి ప్రీతిపాత్రమనీ వివరించాడు.

"బృహతీ సమాఖ్యతోఁ బెంపు మీఱెడు వీణె
వహియించి యెపుడు విశ్వావసుండు,
జగతిఁ గళావతీ సంజ్ఞ నొప్పెడి వీణె
తోడ నే ప్రొద్దును దుంబురుండు,
మహతీ సమాహ్వయ మహనీయ మీ వీణె
మానక నిత్యంబుఁ బూని యేను,
గచ్ఛపి యనుపేర గరము శోభిలు వీణె
సవరించి జగదంబ శారదయును
బాయ కెంతయు బాటింతు, భంగులరయ
విద్యలందెల్ల సంగీత విద్య మిగుల
నుత్తమము గాదె ... ...
... ... ... ... ..."2

ఈ విధంగా మోక్షాన్ని సులభంగా పొందాలంటే సంగీతంవల్ల సంభవమౌతుందనే విషయంకూడా పింగళి సూరన వ్యక్తీకరించాడు.

కళాపూర్ణోదయంలో వీణ వాయించేటప్పుడు వాయింపుతోబాటు పాడటం కూడా విశేషంగా కనిపిస్తుంది.

పల్నాటి వీరచరిత్రలో చేసిన ప్రదర్శనలాంటి ప్రదర్శన ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఉంది. ప్రద్యుమ్నుడు వజ్రనాభుని సభలో మాయా వేషధారియై చేసిన యక్షగాన ప్రదర్శనలో సంగీత వాద్య గీతాది ప్రస్తావన కనబడుతుంది.

"వజ్రనాభుడు రాజ్య వైభవం బెంతయు మెరసి.... ....
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....
బూర్వరంగ ప్రవర్తన పొందుపఱుప"

---

1. కళాపూర్ణోదయం - ద్వితీయాశ్వాసం - 61, 62 పద్యాలు
2. కళాపూర్ణోదయం - ద్వితీయాశ్వాసం - 63 వ పద్యం.

"గాంధార ప్రముఖ స్వరశ్రుతికళా గంభీర వారాంగనా
గాంధర్వంబు, ఘన స్వనంబు, తత నిక్వాణంబు, వంశాదిసం
బంధి స్వాన పరంపరా మహిమయున్ మద్దెళ్ళ ధింధింధిమిం
ధిందోం ధిక్కి ధిమిక్కి శబ్దభరమున్ దీపింప నా పూర్ణతన్"

"సరమిజం చత్పుట, చాచపుటోద్ఘట్ట
షట్పితాపుత్రక, స ఒజ్ఞలమర
వెలయుచుండెడు సమ విషమ తాళప్రవృ
త్తులు నాల్గు, ప్రస్తార కలన వలనఁ
గలుగు నానా తాళములు, యథోక్త స్ఫూర్తిఁ
బరగునేలాది ప్రబంధ చయము
ద త్తదర్థ స్థాన ద త్త పటాక్షర
బిరుదాదికాంగ విస్ఫురణ దనర"

"క్షితిఁ జతుర్దశ ముద్రక గీత భేద
ములు దురాపము లింద్రుడు వర్తిలె నవియును
నిఖిల కళలును గల రౌక్మిణేయు శిక్ష
వలన దన్నాట్య ప్రవర్తనమున"[1]

మంగళపూర్వంగా విధి విధాయకంగా ప్రద్యుమ్నుడు రంగ ప్రవేశం చేశాడు. "గమపదని" అని మొదలయ్యే గాంధార గ్రామంతో చచ్చత్పుట చాచపుటాది మార్గ తాళాలతో, వీణ, మృదంగ వాద్యాలతో సమ విషమాది వృత్తాలతో అపూర్వమైన నాట్యం చేశారు. ఏలాది ప్రబంధాలను బిరుదాదికాలతో ఆలపిస్తూ ఆయా సందర్భాల కనుగుణంగా స్థాయులతో హృదయానికి హత్తుకునేట్లు కడువేడుకతో సభను రంజింపజేశారు. పింగళి సూరన కాలంనాటికి దేశి రూపమైన యక్షగానం సంప్రదాయబద్ధమైన రాగ, తాళ వాద్యాలతో చేరి అందరినీ అలరింప జేసే విధంగా పరిణతి చెందింది అనడంలో సందేహం లేదు. ఆనాటి ప్రదర్శనలో నాంది, ప్రస్తావనలతో కూడిన గంగావతరణాది నాటకాలు చోటు చేసుకున్నాయి.

ఈ విధంగా సాహిత్యంలో వినోదార్థం మొదట ఉపయోగపడిన సంగీత, వాద్యాదికం కావ్య ప్రయోజన సిద్ధికై పరోక్షంగా తోడ్పడటం వరకూ వచ్చింది. దాంతోబాటు సంగీతానికి గౌరవాదరణలు అన్ని విధాలా సాహిత్యానికి లభించినట్లే లభించాయి.

1. ప్రభావతీ ప్రద్యుమ్నం - చతుర్థాశ్వాసం.

ప్రబంధం అన్న పదం వినగానే ముందుగా మనం గుర్తించేది 15 వ శతాబ్దపు కావ్య ప్రక్రియ. ప్రబంధ శబ్దం అనేది సాహిత్యంలో కావ్యరూపంగా మొట్టమొదట చెప్పిన లాక్షణికుడు భామహుడు.

"భావకవిత్వమితి ప్రాహుః ప్రబంధ విషయం గుణం."

"తరువాత దండి పద్య గద్య మిశ్రభేదంతో కావ్యం మూడు విధాలు అని కావ్య విభాగం చేశాడు. పద్యకావ్యాలు నానావృత్తాలతో కూడినవనీ ఛందో విచింత్యాం సకల సత్ప్రబందో నిదర్శితః[1] అని నుడివెను. ఆ పిమ్మట లాక్షణికులు కూడా ప్రబంధ శబ్దాన్ని కావ్యపర్యంగానే ఉపయోగించారు.

అష్టాదశ వర్ణనాత్మకమై ప్రసిద్ధ నాయక చరిత్రం గలది ప్రబంధంగా ఏర్పరచి, నిర్దిష్టమైన లక్షణాలను ఇమిడ్చారు. ఇదే విధంగా సంగీతశాస్త్రంలో కూడా ప్రబంధ రచన ఒకటి ఉంది. భరతముని నాట్యశాస్త్రంలో ధ్రువాధ్యాయంలో పదం గురించి పేర్కొన్నారు. ఈ పదమే ఏ రచనకైనా మూలం. నాట్యశాస్త్రంలో పేర్కొన్న పదం స్థూలంగా గేయం, గీతం, గానం, ఇవన్నీ గీతానికి పర్యాయపదాలే అని అంటారు విజ్ఞులు. కానీ గీతం వేరు, ప్రబంధం వేరు. గీతం అంటే పల్లవి అనుపల్లవి చరణాలనే విభాగాలు లేని ఒక సులభ సంగీత రచన.

ఈ గీత రచనలో ధాతువు అనబడే ప్రతీ స్వర సంపుటికీ మాతువు అనబడే సాహిత్యాక్షరాల్లుంటాయి. ఈ సాహిత్యం దైవ స్తోత్రానికి సంబంధించి ఉంటుంది. సంగీతాభ్యాసకులకు ఈ గీతంవల్లనే మాతువు సాహిత్య రూపంగా పద ప్రయోగానికి మూలంగా పరిచయమౌతుంది.

---

1. కావ్యాలంకారః - తృతీయపరిచ్ఛేదః.

గీత ప్రబంధాల భేదం ఈ క్రింది శ్లోకాల్లో స్పష్టమౌతుంది:

"గీర్వాణ ముఖ భాషాణాం పదం మాతురితీరితమ్
ధాతు మాతు సముత్పన్నం గీతమిత్యుచ్యతే బుధైః
తద్విధాస్యాత్ ప్రబంధశ్చ గీతం చేతి ద్వయం క్రమాత్
లక్షణం చ తథా ధాతు మాత్వాది బహు లక్షణైః
బంధః ప్రబంధో విజ్ఞేయ స్తతో గీత ముదీర్యతే
ధ్రువాది ధాతు రచితం విదార్యా ద్యైరలంకృతమ్...."[1]

భరతముని ధ్రువాధ్యాయంలో పేర్కొన్న పదం ప్రకృష్టమైన బంధంతో ప్రబంధమయిందంటారు. పదం మూలమైనప్పటికీ పై శ్లోకాల వల్ల గీతం వేరూ ప్రబంధం వేరూ అని చెప్పాలి. అదీగాక ధాతువులు, అంగాలు మొదలైన లక్షణాలతో గీతం కంటే ప్రబంధం భిన్నమైనదని తెలుస్తోంది. శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో స్వరగతాధ్యాయంలో గీత రచన గురించి చెప్పాడు. ప్రబంధానికి ప్రత్యేకాధ్యాయం రచించాడు.

ప్రబంధం గ్రంథస్థం కాకముందు దేశీ వ్యవహారంలో గేయ రీతిలోనే ఉండేది. గేయ రీతుల్ని కొన్ని ప్రత్యేక లక్షణాలతో నిర్దిష్టం చేసి క్రమ పద్ధతితో శాస్త్రగతం చేశారు. అదే ప్రబంధ రచన చేయాలంటే, పాండిత్య ప్రకర్షతో పాటు మార్గ, దేశీ వ్యవహారాల్లో గాన సంప్రదాయం, సంగీత శాస్త్ర పరిజ్ఞతా ఉన్న వాగ్గేయకారునికి మాత్రమే సాధ్యం. ఈ విషయం వాగ్గేయకారుని లక్షణంలో స్పష్టమౌతుంది. వాక్పటుత్వంతో పాటు ఈ క్రింది లక్షణాలు ఉండాలి:

"రాగద్వేష పరిత్యాగః సార్ద్రత్వముచితజ్ఞతా
అనుచ్ఛిష్టోక్తి నిర్బంధో నూత్నధాతు వినిర్మితిః
పరచిత్త పరిజ్ఞానం ప్రబంధేషు ప్రగల్భతా
ద్రుతగీతి వినిర్మాణం పదాంతర విదగ్ధతా"[2]

1. సంగీత సూర్యోదయం - ప్రబంధ ప్రకరణం.
2. సంగీత రత్నాకరః - ప్రకీర్ణకాధ్యాయః.

శ్రీ రజనీకాంతరావు ప్రబంధేష్వప్రగల్భతా అన్న వాక్యానికి అర్థం ఇలా వివరించారు:

"అంటే సంగీత శాస్త్రములో భరతాది లక్షణకారులచే ప్రోక్తములై దేశ భాషలలో పరివ్యాప్తములై ఉన్న శాస్త్రీయ సంగీత రచనా రూపములకు ప్రబంధములని పేరు. సూడ ప్రబంధం........... ఏలా........ కంద ... ... వర్ణస్వర........... గద్య........... ఆర్యా........... ఈ ప్రబంధములలో పాండిత్యం సంపాదిస్తే వాగ్గేయకారుని గేయ రచనా శక్తి విస్తృతమై తీరుతుంది."[1]

వాగ్గేయకారులు రచించిన ప్రబంధ లక్షణాలు సంగీత రత్నాకరం, సంగీత సూర్యోదయం, చతుర్దండి ప్రకాశిక, సంగీత దర్పణం మొదలైన శాస్త్రాల్లో కనబడతాయి. సంగీత రత్నాకరంలో—

"ప్రబంధా వయవోధాతుః స చతుర్ధా నిరూపితః
ఉద్గ్రాహః ప్రథమ స్తత్ర తతో మేలాపకధ్రువౌ
ఆభోగశ్చేతి తేషాంచ క్రమాల్లక్ష్మాభిదధ్మహే!
ఉద్గ్రాహః ప్రథమో భాగస్తతో మేలాపకఃస్మృతః॥
ధ్రువత్వాచ్చ ధ్రువః పశ్చాదాభోగ స్త్వన్తిమో మతః।
ధ్రువాభోగాన్తరే జాతో ధాతురన్యోఽన్తరాభిధః॥
సతు సాలగసూదస్థ రూపకేష్వేవ దృశ్యతే।
వాతపిత్త కఫా దేహధారణాద్ధాతవో యథా॥
ఏవమేతే ప్రబంధస్య ధాతవో దేహధారణాత్।
తత్రమేలాపకాభోగౌ న భవేతాం క్వచిత్క్వచిత్॥
సద్విధాతుస్త్రిధాతుశ్చతుర్ధాతురితి త్రిధా।
ప్రబంధోఽంగాని షట్ తస్యస్వరశ్చ బిరుదం పదమ్॥
తేనకః పాటతాలౌచ ప్రబంధ పురుషస్య తే।"

.....................................................................

.....................................................................

1. వాగ్గేయకార చరిత్రము - 3 వ అధ్యాయం - వాగ్గేయకార లక్షణము.
2. సంగీతరత్నాకరః - ప్రబంధాధ్యాయః.

## ప్రబంధ లక్షణాలు :

ప్రబంధాంగాలూ, ప్రబంధ ధాతువులూ ప్రబంధ నిర్మాణంలో ఉన్న లక్షణాలు. ప్రబంధానికి ఉద్గ్రాహం, మేలాపకం, ధ్రువం, ఆభోగం అనే నాలుగు ధాతువులుంటాయి.

స్వరం, బిరుదం, పదం, తాళం, పాటం, తేనకం అనే ఆరు అంగాలుంటాయి. పైన శార్ఙ్గదేవుడు చెప్పినట్లుగానే తరువాత శాస్త్రకారులు కూడా అవే లక్షణాలు చెప్పారు.

ప్రబంధ ధాతువుల అంగాంగ లక్షణాలను ఈ విధంగా నిర్వచించారు:

ఉద్గ్రాహం : ఒక రచన దేనితో ఆరంభిస్తుందో అది ఉద్గ్రాహం అంటే పల్లవి ఉద్గ్రాహం అన్నమాట.

పురందరదాస విరచిత గీతం "శ్రీ గణనాథ"లో "లంబోదర లకుమికర అంబాసుత అమరవినుత" అని రెండవ చరణం పాడబోయేముందు పాట చరణాల మధ్య వ్యత్యాసాన్ని పోగొట్టి పల్లవి స్థానంలో ఉండేది ఉద్గ్రాహం.

ధ్రువం : ఇది ప్రబంధ ముఖ్యాంగం. అనగా రచనలో చరణమే ధ్రువం.

సంగీత రచనలో చరణానికి ధ్రువమని పేరు. త్యాగయ్యగారి "నగుమోము గనలేని" అనే కృతిలో "ఖగరాజు నీయానతి" అక్కడ నుండి చరణమౌతుంది. ఆ చరణమే ధ్రువం.

"ప్రక్కల నిలబడి గొలిచెడి" అనే కృతిలో చరణం "తనువుచే వందన మొనరించుచున్నారా" అనేది ధ్రువమౌతుంది.

మేళాపకం : ఉద్గ్రాహ ధ్రువాలను కలిపేది. ఇది రచనలో అనుపల్లవి అవుతుంది.

"వినాయకుని వలెను" అన్న త్యాగయ్యగారి కృతిలో "అనాధరక్షకి శ్రీకామాక్షి" అనే అనుపల్లవి మేళాపకం అవుతుంది. ఇది ఉద్గ్రాహ ధ్రువాలను కలిపేది.

**ఆభోగం :** రచనలో అనుబంధంగా అంటే చరణాల తరువాత వచ్చే భాగాన్ని ఆభోగం అంటారు. త్యాగరాజు పంచరత్నాల్లో చరణాల తరువాత ఉన్న సాహిత్యభాగం ఆభోగం అవుతుంది.

"ఆరభిరాగం-సాధించెనే" అన్న కృతిలో చరణ స్వరాల తరువాత ప్రత్యేకించి ఆలపించిన సాహిత్యపు పంక్తులు.

"సద్భక్తుల నడతలిట్లనెనే

అమరికగా నా పూజకొనెనే అలుగవద్దనెనే" ఇలా సాగే ఈ సాహిత్య భాగం ఆభోగం అవుతుంది. ఆభోగం పాడి చివర మళ్ళీ పల్లవి పాడాలి. చరణ స్వరాలాపన అయిన తరువాత తిరిగి పల్లవి ఆలపించాలంటే ఈ ఆభోగం తప్పనిసరిగా పాడాలి. ఆభోగం ఆ విధంగా ఉపయోగిస్తుంది.

ఏ రచనలోనైనా ఏరెండైనా ధాతువులు తప్పనిసరిగా ఉండాలి. ఉద్గ్రాహం, ధ్రువం తప్పనిసరిగా ఉంటాయి. కొన్ని రచనల్లో అనుపల్లవి ఉండదు. సమష్టి చరణం కొన్ని రచనల్లో కనిపిస్తుంది. రెండు ధాతువులున్న ప్రబంధాన్ని ద్విధాతు ప్రబంధమనీ మూడు ధాతువులుంటే త్రిధాతు ప్రబంధ మనీ అంటారు.

**ప్రబంధాంగాలు :** స్వరం, బిరుదం, పదం, తాళం, పాటం, తేనకం అనే ఆరింటిలో కనీసం రెండు అంగాలైనా ప్రబంధానికి తప్పనిసరిగా ఉండాలి.

ఆరు అంగాలున్న ప్రబంధాలు 'మేదినీ' జాతి ప్రబంధాలనీ, ఐదు అంగాలున్న ప్రబంధాలు 'ఆనందినీ' జాతి ప్రబంధాలనీ, నాలుగంగాలున్న ప్రబంధాలు 'దీపనీ జాతి అనీ, మూడింటితో కూడినవి 'భావనీ' జాతి అనీ, రెండింటితో కూడినవి 'తారావళీ' అని విభజించాడు శార్ఙ్గదేవుడు.

ప్రబంధానికి మరో విభజన కూడా ఉంది. సూడ ప్రబంధమనీ, ఆళి సంశ్రయ ప్రబంధమనీ, విప్రకర్ణ ప్రబంధమనీ ముప్విధాలు. ఈ విభజన కూడా శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు.[1]

సూడ ప్రబంధంలోకి ఏల, కరణం, ఢేంకి, వర్తని, లంభ, రాస, ఏకతాళి ఇత్యాదులు వస్తాయి.

ఆళి ప్రబంధంలోకి వర్ణ, గద్య, కైవాడ, అంకచారిణి, కంద, గాథా, ద్విపద, కలహంస ఇత్యాదులు వస్తాయి.

విప్రకీర్ణ ప్రబంధంలోకి శ్రీరంగ, శ్రీవిలాస, విజయ, త్రిపద, దండక, ఝంపట, దంతి మొదలైన ప్రబంధాలు వస్తాయి.

పైన పేర్కొన్న ప్రబంధ లక్షణాలు అన్నింటిలో ఒకే విధంగా ఉండవు. ఇవి దేశ వ్యవహారంలో గేయ రూపంతో ఉండి వాగ్గేయకార స్వకపోలకల్పిత పాండితీ ప్రజ్ఞతో నూతనత్వాన్ని సంతరింపజేసుకున్నందున స్థూలంగా లక్షణాలు పేర్కొనడం జరిగింది.

**ప్రబంధంలో వస్తువు :** వస్తువు మాత్రం భగవత్సంబంధి. ప్రబంధాలలోని వస్తువు స్థూలంగా భగవంతుని నాయకునిగా స్తుతించడంగానీ, రాజుల గుణగణాలను కీర్తించడంగానీ, ఆధ్యాత్మికంగా, వేదాంత విషయాలను గానీ వర్ణించేదిగా కూడా ఉంటుంది.

ఈ విధంగా ఉన్న ప్రబంధానికి మరో విభజన కూడా ఉంది. నిర్యుక్త, అనిర్యుక్త అని ద్వివిధం. ఛందోనియమాదులతో కూడిన ప్రబంధం నిర్యుక్తం అవుతుంది. ఛందస్తాలాది నియమాలు లేని రచన అనిర్యుక్తం అవుతుంది. ఈ విభజన కూడా శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు.

"అనిర్యుక్తశ్చ నిర్యుక్తః ప్రబంధో ద్వివిధోమతః
ఛందస్తాలా ద్యనియ మా దాద్యః స్యా న్నియమాత్ పరః."[2]

---

1. సంగీత రత్నాకరః - ప్రబంధాధ్యాయః.
2. సంగీతరత్నాకరః - ప్రబంధాధ్యాయః.

అనిర్యుక్త ప్రబంధమే ఆళి సంశ్రయ ప్రబంధ భేదమైన గద్య ప్రబంధం. ఈ గద్య ప్రబంధం మిగిలిన ప్రబంధ భేదాల కంటే విశిష్ట లక్షణోపేత మైంది. సంగీతశాస్త్రంలో ఉన్న ఈ గద్య ప్రబంధం సాహిత్యంలో కూడా చోటు చేసుకుంది.

అయితే గద్య ప్రబంధాన్ని గురించి తెలుసుకొనే ముందు కావ్యగత గద్యకూ, ఛందఃపరంగా చెప్పిన గద్యకూ, సంగీత గద్యకూ ఏమైనా సామీప్యం ఉన్నదా? అనే విషయం తెలుసుకోవాలి.

సాహిత్య లక్షణకారులు మొదట కావ్యాన్ని గద్యం, పద్యం అని ద్వివిధం చేశారు. సంస్కృతంలో కాదంబరి, దశకుమార చరిత్ర ఇత్యాది సుదీర్ఘమైన గద్య కావ్యాలు కానవస్తాయి. కాదంబరి వంటి కావ్యాలలో అచ్ఛోద సరస్సు వర్ణన వంటి గద్యభాగాలు చూర్ణిక శైలిలో సాగి, రాగయుక్త గానానికి అనుకూలంగా ఉంటాయి. మొత్తం కావ్యం గానయోగ్యత పొందజాలదు. గద్య పద్యోభయమైన మూడవరకపు కావ్యాల్లో(చంపువు)అక్కడక్కడ భావ విస్ఫోర కాలై క్లుప్తంగా వుండి కొన్ని గద్యలు కన్పిస్తాయి. అవి గానయోగ్యమైనవి.

## సంస్కృత గద్యలక్షణం - క్రమ పరిణామం

భరతుడు నాట్యశాస్త్రంలో ఛందో విషయమై వివరిస్తూ పదం నిబద్ధం, అనిబద్ధం అనిచెప్పి, అనిబద్ధమైన పదం చూర్ణం అని చెప్పాడు. అది కేవల పఠనకర్మ వలన గద్యం అనబడుతుందనీ అభినవగుప్తుడు చెప్పాడు.

"అనిబద్ధ పదం ఛంద స్తథా చా నియతాక్షరం
అర్థాపేక్ష్యాక్షర స్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధైః"[1]

వృత్తబద్ధం కానిదీ, అక్షర సంఖ్యా నియమాలు లేనిదీ, గురు లఘు నివేశ నియమం లేనిదీ, వీర శృంగారాది రసాభివ్యక్తం చేసే అక్షరాల కూర్పు కలదీ చూర్ణం అని వివరించాడు.

1. నాట్యశాస్త్రం. 14 వ అధ్యాయం

అటువంటి గద్యను లక్షణకారులు వృత్తగంధి, చూర్ణం, ఉత్కళిక అని త్రివిధం చేశారు.

"గద్యం వృత్తగంధి చూర్ణ ముత్కళికా ప్రాయంచ
పద్యభాగవద్వృత్తగంధి, అనావిద్ధ లలిత పదం చూర్ణమ్
విపరీత ముత్కళికాప్రాయమ్."[1]

వామనుడి తరువాత విశ్వనాథకవిరాజు గద్యను నాలుగు విధాలుగా విభజించాడు.

"వృత్తలేశ విహీనమయిన గద్యము ముక్తకము, వృత్తగంధి ఉత్కళికాప్రాయము, చూర్ణకము అని."

తొలిది సమాసరహితము, రెండవది వృత్త భాగములతో కూడినట్టిది, మూడవది దీర్ఘసమాసాఢ్యము, నాల్గవది అల్పసమాసాన్వితము.

సంస్కృత భాషలోని సంప్రదాయాన్ని తెలుగుభాష కూడా అనుసరించింది. తెలుగులో లక్షణకర్తలు ఐదు విధాలయిన గద్యలను పేర్కొన్నారు.

గద్య, బిరుదగద్య, చూర్ణిక, విన్నపం, వచనం అని అనంతుని ఛందోదర్పణంలో ఈ విభాగం ఉంది. ఈ భేద లక్షణాలు ఇలా ఉన్నాయి:

గద్య → అనుకరణ శబ్ద యుక్తంబై యొప్పు.

బిరుదగద్య → సంబోధనాంత పదబంధురము.

చూర్ణిక → ద్వివచన బహువచన సందర్భాలగు విభక్త్యనుశాసన, సమాసాదిత కల్పనాజల్పితం.

వచనం → బహుప్రకార రచనా నిచయ ప్రాదుర్భూతమ్మై సంచరించు.

విన్నపం : విన్నపమై ఋజుమార్గమ్ముల ననుగమించు.

2. కావ్యాలంకార సూత్రవృత్తిః - ప్రథమాధికరణం - తృతీయోధ్యాయః - 22, 23, 24, 25 సూత్రాః.

## సంగీత గద్య ప్రబంధ భేదాలు, లక్షణాలు :

సంగీతంలో ముఖ్యమైన విభాగాల్లో ఆరు విధాల గద్య భేదాలు కానవస్తాయి :

"తత్ షోఢో త్కళికా చూర్ణం లలితం వృత్తగంధి చ
ఖండం చిత్రం చ తేషాంచ ప్రభవః సామవేదతః"[1]

వాటి లక్షణ వివరణ ఈ విధంగా ఉంది :

"గాత వ్యోత్కళికా వీరే రక్తా రుద్రాధిదేవతా
గౌడీయరీతి రుచిరా వృత్తిమారభటీం శ్రితా।

చూర్ణం శాంతే రసే పీతం గాతవ్యం బ్రహ్మదైవతం
వైదర్భరీతి సంపన్నం సాత్త్వతీం వృత్తిమాశ్రితమ్,

సితం మదన దైవత్యం శృంగార రసరంజితం
లలితం కైశికీం వృత్తిం పాంచాలీం రీతిమాశ్రితమ్।

వృత్తగంధి రసే శాంతే పీతం చ మునిదైవతం
పాంచాల రీతౌ భారత్యాం పద్యభాగ విమిశ్రితమ్।

ఖండం గణేశ దైవత్యం సాత్త్వతీం వృత్తిమాశ్రితం
శ్వేతం హాస్య కృదారబ్ధం వైదర్భీ భంగి సంభవమ్।

శృంగారే వైష్ణవం చిత్రం చిత్ర కైశిక వృత్తిజం
వైదర్భ్యా రచితం రీత్యా నానారీతి విచిత్రయా।

వేణీ మిశ్రమితి ప్రాహురన్యే భేదద్వయంపరం
వేణీ సర్వైః కృతా మిశ్రం చూర్ణకైర్వృత్త గంధిభిః।

ద్రుతా విలంబి తా మధ్యా ద్రుత మధ్యా తథాపరా
గతిః ద్రుత విలంబా స్యాత్ షష్ఠీ మధ్య విలంబితా।"[2]

ఇతి గద్యస్య షట్ ప్రోక్తా గతయః పూర్వ సూరిభిః

---

1. సంగీతరత్నాకరః - ప్రబంధాధ్యాయః.
2. సంగీతరత్నాకరః - ప్రబంధాధ్యాయః.

1. **ఉత్కళిక :** వీరరసోచితం - రుద్రదైవతాకం - గౌడీయరీతి - రక్త వర్ణం - ఆరభటీ వృత్తి - ద్రుతగతి.
2. **చూర్ణం :** శాంత రసోచితం - బ్రహ్మ దైవతం - వైదర్భీరీతి - సాత్త్వతీ వృత్తి - పీత వర్ణం - విలంబితగతి.
3. **లలితం :** శృంగార రసోచితం - మదన దైవతం - పాంచాలీ రీతి - కైశికి వృత్తి - శ్వేత వర్ణం - మధ్యగతి
4. **వృత్తగంధి :** శాంతరసోచితం - మునిదైవతాకం - పాంచాలీ రీతి - పద్యభాగ మిశ్రితం - భారతీ వృత్తి - పీత వర్ణం - ద్రుత మధ్యగతి.
5. **ఖండం :** ఆరంభంలో హాస్యరసం - గణేశ దైవతాకం - వైదర్భీరీతి - సాత్త్వతీవృత్తి - శ్వేత వర్ణం - ద్రుత విలంబితగతి.
6. చిత్రం **:** శృంగార రసోచితం - వైదర్భీరీతి - విష్ణుదైవతాకం - చిత్ర కైశికీ వృత్తి - మధ్యవిలంబితగతి.

సాహిత్య లక్షణకారులూ, సంగీత శాస్త్రకారులూ ఇచ్చిన గద్యల నిర్వచన వివరణలు విశ్లేషిస్తే కొంత సమన్వయం ఉన్నట్లు కనిపిస్తోంది.

సందర్భాన్ని బట్టి ఔచిత్యవంతంగా భావం, తదనుగుణంగా భాష ఉంటూ, రసస్ఫూర్తి కలిగించేటట్లుగా అందించే కవి కపోల కల్పిత కావ్యంలో ఒక భాగమే గద్యం ఆ కావ్య వస్తువు కవి కల్పితం కాకపోయినా రచనా రీతి కవి సృష్టే.

గద్యం, వచనం, విన్నపం, బిరుదం ఇత్యాది పదాలకు భేదమంతగా కానరాదు. అన్నింటిలో ఇంచుమించుగా వస్తువు ఒకే తీరుగా ఉంటుంది.

సంస్కృత భాషామ తల్లి రూపాన్ని ఇముడ్చుకొని విడదీయలేని విధంగా తెలుగు భాష రూపు దిద్దుకుంది. అదే విధంగా సాహిత్య లక్షణాలనూ ఛందోరీతులనూకూడా తెలుగుభాష సంస్కృత వాఙ్మయంనుండే కొంత గ్రహించింది.సాహిత్య లక్షణకారులు గద్యకు భావం, భావానుగుణంగా భాష, భాషానుగుణంగా రీత్యాదులను లక్షణాలుగా చెప్పారు. అదేవిధంగా సంగీత శాస్త్రకారులు సంగీతంలో కూడా ప్రతీ గద్యకూ రాగనిర్దేశం చేయకపోయినప్పటికి

గద్యం నడిచే గతిని మాత్రం చెప్పారు. గతిని నిర్దేశిస్తూ రసం, అధిదేవతా వృత్తీ రీతీ కూడా చెప్పారు. ఇటువంటి లక్షణాలు కేవలం భగవత్పరమైన స్తుతి వస్తువుగా ఉన్న ప్రాచీన గద్య ప్రబంధాలకు నిర్ణయించినవి. సంగీతంలోనే కాక సాహిత్యంలో కూడా ఇటువంటి లక్షణాలు గల గద్యలు అక్కడక్కడా మనకు కనిపిస్తాయి. వాటి లక్ష్యలక్షణాలను సమన్వయపరిచే ముందు సంగీత గద్య పరిణామక్రమాన్ని కొంత వివరించాల్సి ఉంది.

## సంగీత గద్య - పరిణామక్రమం :

అనూచానంగా సంప్రదాయబద్ధంగా ఆలాపనలో జన వ్యవహారంలో అతి పురాతన గద్యలు సంస్కృత భాషలో కనిపిస్తున్నాయి. త్రిపురాంతకుడు రాసినదని చెప్పబడే శ్యామలా దండకం చాలా ప్రాచీనమైంది. ఇప్పటికీ ప్రచారంలో ఉంది. దండకం కూడా ఒక గద్య. ఈ శ్యామలా దండకం గద్య ప్రబంధ భేదాలలో ఖండగతి గద్య లక్షణాలు కలది.

"జయజనని! సుధా సముద్రాంతర్హృద్యన్మణి ద్వీప సంరూఢ బిల్వాటవీ మధ్య కల్పద్రుమా కల్పకాదంబ కాంతార వాసప్రియే, కృత్తివాసప్రియే, సాద రారబ్ధ సంగీత సంభావనా సంభ్రమాలోల నీపస్రగాబద్ధ చూళీ సనాథత్రికే, సాను మత్పుత్రికే, శేఖరీభూతశీతాం సురేఖా మయూఖావళీ నద్ధ సుస్నిగ్ధ నీలాలకశ్రేణి శృంగారితే, లోక సంభావితే, కామలీలా ధనుస్సన్నిభ భ్రూలతా పుష్ప సందేహ కృచ్చారు గోరోచనా పంక కేళీ లలామాభిరామే, సురామే. రమే...............

.................................................................................

సర్వ చక్రాత్మికే, సర్వ వర్ణాత్మికే, సర్వరూపే, జగన్మాతృకే పాహిమాం పాహి మాంపాహి పాహి.

ఇతి శ్రీ మహాకవి కాళిదాస కవిశ్రేష్ఠ విరచితం శ్రీ శ్యామలాదండకమ్.

అని దండకం క్రింద రాయడం ఏ భగవత్ స్తుతుల పుస్తకాల్లోనైనా కనిపిస్తుంది. ఇది కాళిదాసుని రచనగా ప్రచారంలో ఉంది.

సంగీత రత్నాకరంలో ప్రబంధ ప్రకరణంలో గద్య ప్రబంధాలను వివరిస్తూ "తేషాం చ ప్రభవః సామవేదతః" అని అన్నాడు. సంగీత సూర్యో

దయంలో "ఉత్పత్తి స్థాన మేతేషాం సామవేదో నిగగద్యతే" అని అన్నాడు. "గద్య ప్రబంధం పుట్టుక సామవేదం నుండి" అని అర్థం చేసుకోవాలి.

వాగ్గేయకార మార్గ దేశి గాన సంప్రదాయాల్లోని సంగీతజ్ఞత, ప్రజ్ఞా పాటవాల నుండి వెలువడిన దేశి సంగీతంలోని భాగం ప్రబంధం అని సర్వ జనాంగీకృతం. అటువంటప్పుడు గద్య ప్రబంధం సామవేదం నుండి ఎలా ఉద్భవించింది? అనే ప్రశ్న వస్తుంది.

అయితే "శార్ఙ్గదేవుని నాటికి మార్గగాన పద్ధతి ప్రాచుర్యాన్ని కోల్పో యిందని ఆ తరువాతి సంగీతదర్పణ వ్యాఖ్యాతలన్నారు. మతంగుని బృహద్దేశితో మొదలై శార్ఙ్గదేవుని సంగీత రత్నాకర రచనలోనికి తేవార వర్ధని వంటి దేశి సంగీత (రాగ రీతులు) లక్షణ బద్ధం అయి, ఆయా ప్రాంతాల వాడుకలోని దేశిసంగీతం శాస్త్రీయతా గౌరవం పొందింది. కల్లినాధుడు చెప్పినట్లు, సంగీత విద్వల్లోకం ఈ విధంగా రూపొందిన నేటి కర్ణాటక సంగీతాన్నే దేశి సంగీతం అంటారు. వాగ్గేయకార కర్తృత్వం కారణంగా ఆయా ప్రాంతాల దేశి సంగీతం మార్గత్వాను లక్షితమైనా పరిణమించినా అది మార్గ సంగీతం కాదు" అనీ అదే నేటి ప్రాంతీయ దేశి సంగీతమనీ ఆచార్య సాంబమూర్తి, ఆర్. రంగరామాను జయ్యంగార్ వంటి కర్ణాటక సంగీత విద్వాంసులూ, 'అభిజాతదేశి' అని స్వామి ప్రజ్ఞానంద వంటి భారతీయ సంగీతేతిహాస కర్తయొక్క నిర్ణయమనీ శ్రీ రజనీ కాంతరావు అభిప్రాయపడ్డారు.

మార్గ-దేశి సంగీతాల గురించి వివరించే సందర్భంలో రామాయణాన్ని కుశలవులు మార్గ పద్ధతిలో గానం చేసినట్లు చెప్పడం జరిగింది.

అప్పటికి లోకవ్యవహారంలో మార్గ సంగీత ఛాయలతోటి గానం ఉంది. ఆ గద్య ప్రబంధరీతి ఉత్పత్తి సామవేదం నుండే అయినా మాతువూ, తత్కాల సంగీతమూ వాగ్గేయకార కృతమే. ఇప్పుడు మార్గ సంగీతం పాడే పద్ధతి పూర్తిగా మృగ్యం. సంగీతం గానీ సాహిత్యంగానీ మార్గతా నులక్షితమయిన దేశ వ్యవహారమైంది. అదే విధంగా గద్య ప్రబంధం కూడా మార్గలక్షణానుగత ప్రబంధం అయ్యింది.

శ్యామలా దండకం ఆలయంలో ఆలపించినట్లుగా వ్యవహారం. ఇటువంటి స్తుతి పరమైన పురాణాంతర్గత గద్యలు అనూచానంగా సంప్రదాయబద్ధంగా ఆలాపన కలిగి ఉన్నవి జనసామాన్యంలో మనకు కనిపిస్తాయి.

రామానుజాచార్యుల గద్యత్రయం కూడా ఈ కోవకు చెందినదే. ఈ గద్యత్రయాన్ని శ్రీ వేటూరిప్రభాకరశాస్త్రిగారు తమ పీఠికలో చూర్ణ, ఉత్కలిక, వృత్తగంధి అన్న మూడు గద్య భేదాలకు ఉదాహరణలుగా పేర్కొన్నారు.

1. చూర్ణం : (అ) అపార కరుణామ్బుధే!
: (ఆ) అనాలోచిత విశేషాశేష లోక శరణ్య!
: (ఇ) ప్రణతార్తి హర!
: (ఈ) ఆశ్రిత వాత్సల్యైక మహోదధే!
: (ఉ) అనవరత విదిత నిఖిల భూత జాత యాథాత్మ్య!
: (ఊ) సత్యకామ!
: (ఋ) సత్య సంకల్ప!
: (ౠ) ఆపత్సఖ?
: (ఌ) కాకుత్స్థ!
: (ఎ) శ్రీమన్!
: (ఏ) నారాయణ!
: (ఐ) పురుషోత్తమ?
: (ఒ) శ్రీరంగనాథ!
: (ఓ) మమనాథ!
: (ఔ) నమోఽస్తుతే!
(శ్రీరంగ గద్యమ్)[1]

---

1. గద్యత్రయం - శ్రీరంగ గద్యం - పుటలు 84, 85.

2. **ఉత్కళిక :** "స్వచ్ఛందానువర్తి స్వరూపస్థితి ప్రవృత్తి భేదా శేష శేషతైకరతిరూప నిత్య నిరవద్య నిరతిశయ జ్ఞానక్రియైశ్వర్యాది అనంత కల్యాణ గుణశేష శేషాశన గరుడ ప్రముఖ నానావిధానన్త, పరిజన పరిచారికా పరిచరిత చరణయుగళ!"[1]

3. **వృత్తగంధి :** 1. ప్రత్యగ్ర ఉన్మీలిత సరసిజ సదృశ నయనయుగళమ్-

2. స్వచ్ఛనీల జీమూత సంకాశమ్

3. అత్యుజ్జ్వల పీతావాసనమ్

4. అతి నిర్మలయా అతిశీతలయా అతి కోమలయా స్వచ్ఛయా మాణిక్యాభయా స్వయా ప్రభయా జగత్ కృత్స్నం జగత్ భాసయంతమ్

5. అచిన్త్య దివ్యాద్భుత నిత్య యౌవన స్వభావ లావణ్య మయామృత సాగరమ్.................................

.........................................................................

.........................................................................

..............తత్క్షణ ఉన్మీలిత పుండరీక సదృశ చరణయుగళమ్"[2]

(శ్రీ వైకుంఠ గద్యమ్)

ఇప్పటికీ వేంకటేశ్వరస్వామి మీద సంస్కృత దీర్ఘ సమాస భూయిష్ఠమై ఉన్న ఒక గద్య ఆలయాల్లోనే కాక ప్రతి శనివారం ఆకాశ వాణిలో కూడా వినిపిస్తూంటుంది ఆలయ సంగీత గద్యంగా దీనిని పెద్దలు చెబుతున్నారు.

---

1. గద్యత్రయం - శరణాగతిగద్యం - పుట 43.
2. గద్యత్రయం - శ్రీ వైకుంఠ గద్యం - పుట 100, 102.

ఇందులోని వస్తువు శ్రీ వేంకటేశ్వరుని స్తుతి. స్వామి వారికి దిన, వార, పక్ష, మాస సంవత్సరాల్లో జరిగే పూజా విధానాదికం వివరించబడింది.

"శ్రీ మదఖిల మహీ మండల మండన ధరణీధర మండ
లాఖండలస్య..................."

అని మొదలయ్యే ఈ గద్యం అక్కడక్కడా గతిలయలు మారుతూ చివర ............"నిత్యకల్యాణ పరంపరోత్తరాభివృద్ధిః భూయాదితి
మహాంతోఽనుగృహ్ణంతు"

అని ముగుస్తుంది.

ఆలపించే పద్ధతిలో గతిలయల మార్పువల్ల భాషా భావాల అవగాహనతోబాటు లయ చమత్కారం కూడా ఈ గద్యలో గోచరిస్తుంది.

ఇదే రీతిలో తత్సమ తద్భవ పద సమ్మిశితమైన సూర్యదండకం ఒకటి ఉంది.

"శ్రీ సూర్యనారాయణా! వేద పారాయణా! లోకరక్షామణీ దైవ చూడామణీ ఆత్మరక్షామణీ నమః పాప శిక్షా నమో విశ్వకర్తా నమో విశ్వ భర్తా నమో దేవతా చక్రవర్తీ పరబ్రహ్మ మూర్తీ త్రిలోకైకనాథా! మహాభూత భేదంబులున్నీవయై బ్రోతువెల్లప్పుడున్ భాస్కరా! హస్కరా పద్మినీ వల్లభా గానలోల త్రిమూర్తి స్వరూపా ..........................................................
.............................................................................................
మహా జన్మాంతర వ్యాధి దారిద్ర్యముల్ పోయి కామ్యార్థముల్

కొంగు బంగారు తంగేడు జున్నై ఫలించున్ గదా భాస్కరా
శ్రీ సూర్యనారాయణా! మహాదేవ దేవా! నమస్తే నమస్తే నమః॥

సూర్యభగవానుని స్తుతిస్తూ భక్తులు తమ స్థితిని చెప్పి, నీ దృష్టివల్ల సమస్త సంపదలు కలుగుతాయనీ, రక్షించుమనీ ప్రార్థించడం ఇందులోని వస్తువు.

"శ్రీ సూర్యనారాయణా వేదపారాయణా లోకరక్షామణీ దైవచూడామణీ" అని పాడుతూ దండకం అక్కడక్కడా ఆపి, పల్లవివలె మళ్ళీ శ్రీ సూర్య నారాయణా..........అని పాడి తిరిగి దండకంలోని తరువాతి భాగం పాడటం ఆకాశవాణిలో శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు ప్రయోగించారు. ఇందులో దండకం మాత్రం ఒకరే పాడారు, పల్లవి వలె శ్రీ సూర్యనారాయణా........ అని నలుగురైదుగురు ఆలపించారు.

కేవలం పద్యంగా పాటగా రాసిన సాహిత్య భాగాన్నే కాక వచనంగా రాసిన సాహిత్య భాగాన్ని కూడా తాదాత్మ్యంలో పాటలా స్తుతిపరమైన గద్య లను పాటలా ఆలయంలో ఆలపిస్తారు. దీనికి మూల ధాతురూపం దేవాలయాల్లో సన్నాయి వాద్యంతో మంగళప్రదమైన రాగాలాపన సేవా పద్ధతిలో లభిస్తుంది. ఆలాపన చేస్తూ సన్నాయి ఆపి, తిరిగి మొదలుపెట్టే వ్యవధిలో, ఆ వ్యవధిని పూరిస్తూ రాగానుగుణంగా డోలును లయగా వాయిస్తాడు డోలువాద్యకుడు.

మాటలు లేని రాగాలాపన సేవ సన్నాయిపైని పరిచ్ఛేదాలుగా తెగి పోతూ సాగుతుంది. ఆ పరిచ్ఛేదాలలో ఆలాపన మంద్ర, మధ్య, తార స్థాయి లలో రాగాన్ని ప్రసరిస్తూ సాగుతూ ఉంటుంది. ఒక్కొక్క గుక్కలో విని పించే ఒక్కొక్క రాగ విన్యాసం మాటలతో దేవునికి విన్నపం చేసుకునే వాక్య విన్యాసం, మాటలలో అంటే గద్యాత్మకమైన విన్నపంలోని రసభావానుసారం రాగ భావంలోని స్థాయిలను గాయకుడు అనుసంధింప జేసుకుంటూ వచన గేయాలను గానం చేస్తూంటాడు. నాగస్వరం రాగాలాపనకు ప్రక్కన లోహపు తాళాలతో డోలు సహకారంతో లయ సాగుతూండినట్లే గాయకుని వచనగానంలో దండె చిటి తాళాలూ లయను మోగిస్తూంటాయి. ఆ లయ ఆ గద్యల్లో ఉండి తీరాలని లేదు.

ప్రజల్లో ఆధ్యాత్మిక భావ ప్రచారానికే సాహిత్యంలో భాగంగా వచన వాఙ్మయం కూడా వచ్చింది. పూర్వ సంస్కృత సంప్రదాయాన్నే అవలం బిస్తూ వెలువడిన మొదటి తెలుగు వచన రచన కృష్ణమాచార్య ప్రణీతమైన సింహగిరి నరహరి వచనాలు.

వైష్ణవ మతపరమైన వచనాలుగా సింహగిరి నరహరి వచనాలు పేర్కొనవచ్చు. ఇందులో సంస్కృత గద్య సంప్రదాయాన్ని గ్రహించినప్పటికీ కొంత మార్పు చేర్పులు రెండూ కనిపిస్తాయి. ఈ వచనాలు ఆధ్యాత్మిక, స్తుతి, చరిత్ర మొదలైన అంశాలు వస్తువుగా కలవి. ఇందులోని ప్రతి వచనం -

"దేవా!" అనే సంబోధనతో ఆరంభమై "అనాథపతీ! స్వామీ! సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ!" అనే మకుటంతో ముగుస్తుంది. ఈ వచనాల్లో పురాణ సంబంధి కథా ప్రసక్తి అక్కడక్కడ ఉంది.

"దేవా! తనువులు మాయ, తలపోసి చెప్పెదనంటినా, కలకలల మోహమిది. ఆశల పాషాణంబిది. అతుకుల జల్లెడ యిది ................................ .................... ఈ దేహంబనెడు లంకపై దండుదిగి, చిత్తమనెడు నింద్రజిత్తుపై రణించి (రావణునిపై రణించి) దుర్బుద్ధులనెడు దుర్మార్గపు రాక్షసుల హతము చేసి, యాశలనెడు రాక్షసుల పేరడించి, మమత మండోదరి నిట్టి దాసిగా నేలి, యాచార్యుండనెడు హనుమంతుని బంపిఁ యాలంక జొచ్చి, వధించి, జీవుండనెడు సీతను దెచ్చి నీపాదారవిందముల భక్తికి హత్తించి దరి జేర్చుమీ! యతిరామానుజవరము, దాతారు, అనాథపతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమోనమో దయానిధీ"[1]

రామాయణ కథను ఐహిక జీవిత బంధాలతో రూపకం చేసి ఆలంకారిక శైలిలో చక్కని రీతిని కొన్ని వచనాలు మనోహరంగా రచించారు.

సింహగిరి వచనాల్లో తాళగంధి వచనాలు కూడా అక్కడక్కడా ఉన్నాయి,

---

1. సింహగిరి నరహరి వచనములు - 4 వ వచనం.

"దేవా! విష్ణుభక్తి లేని విద్వాంసుని కంటే హరకీర్తనము
సేయు నతడె కులజుండు..............................
........................మా సింహగిరి నరహరిదాసులకు దాసులై నంగాని
లేదుగతి! స్వామీ! సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!"[1]

"దేవా! అంకిలియని యెడు తెవులింటికి దిప్పు. అసత్యకృతమే ముప్పు. తగవు ధర్మము నడిపినదే యొప్పు. అనాథపతీ! స్వామీ!......................[2]

ఆనాడు కృష్ణమాచార్యులు, పౌతకమూరి భాగవతులు మొదలైన భాగవతోత్తములు వచనాలు ఆలపించేటప్పుడు ఆలాపనా తీరు ఉపయోగించిన వాద్యాలు వారి వేషాదులు ఈ వచనంలో స్పష్టంగా తెలిపారు.

"..............................................................................
...............పౌతకమూరి వైష్ణవులు దండెలు, తాళంబులు ధరణిపై దించిరి. అయినను మా నేరుపురు గౌరములు, మీ తిరువడిని చేపట్టుడని పౌతకమూరి భాగవతులు కృష్ణమాచార్యులకు దండము సమర్పించిరి. అప్పుడు కృష్ణమాచార్యులు దండెయు। జిఱుతాళంబులు సంధించుకొని, పౌతకమూరి భాగవతుల సన్నిధిని యడియేని విన్నంచునని, యాలావవర్ణనలతో నమో నారాయణాయని (విష్ణు) నామ గుణ కథలు వచన భావంబున గీర్తించెను, ఘుమఘుమ ధ్వనులు మ్రోయగాను దండ మీటుచు, దాళంబు లుగ్గడించుచు, పంచమ వేద స్మృతులుగా, చాతుర్లక్ష గ్రంథ సంకీర్తన వాక్పూజలును చేయంగాను సింహాద్రి నాథుండు నిజరూపంబున లీలావినోదుండై బాలత్వంబున బుర బాలురలోన బాలుండై, కృష్ణమాచార్యుల తిరుమాళిగ సన్నిధి నుండి యాడుచు బాడుచు వచ్చి శ్రీ కృష్ణమాచార్యుల తొడలమీద కూర్చుండెను."[3]

---

1. సింహగిరి నరహరి వచనంలు - 11వ వచనం.
2. ,, ,, - 59వ వచనం.
3. సింహగిరి నరహరి వచనములు-32.

వచనాల ఆలాపనకు దండె, చిటి తాళం వాద్యాలు ఉపయోగించేవారు. పాడుతున్నప్పుడు కొన్ని సందర్భాల్లో అక్కడక్కడ దీర్ఘంగా రాగాలాపన చేస్తారు. ఆ ఆలాపన చేస్తూ ఆపినపుడు మధ్య ఉండే అంతరాన్ని తిరిగి సాహిత్యం అందుకునే వరకు ముక్తాయింపుగా చిటి తాళం సహకారాన్ని అంది స్తుంది. వచనాలు ఆలపించేటప్పుడు దండె వాద్యధ్వని కడు రమ్యంగా వచనం లోని భాషకూ, భావానికీ, పాడే వేగానికీ తగినట్టుగా ఉంటుంది.

"ఆలాపనా రీతితో ఘుమ ఘుమ ధ్వనులు ఇచ్చే దండె మీటుతూ"
అంటే ఈ ఆలాపనా పద్ధతిలో దండె చేసే ధ్వని అన్నమాట.

వచన వాఙ్మయానికి మొదటి కావ్యమయిన ఈ సింహగిరి నరహరి వచనాలలో సూచనగా ఆలాపనాది రీతుల్ని వివరించడంవల్ల ఇతఃపూర్వం మరి తరువాత ఉన్న వచనాలను పాడటం తెలుస్తుంది.

బహుశః ఈ వచనాలనే దృష్టిలో ఉంచుకొని పదకవితా పితామహుడు తాళ్ళపాక వారు సంకీర్తనా లక్షణాన్ని చెప్పారనవచ్చు. ఆ సంకీర్తన లక్షణం తెలుగున అనువదిస్తూ చిన తిరుమలాచార్యుడు వచన రచనను నిర్వచించాడు.

వ. మఱియు చూర్ణాఖ్యపదం బెట్టిదంటేని

కం. ధర కృష్ణా చార్యాదిక
పరికల్పిత పదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగున నిర్యుక్త నామ భాసితమగుచున్

వ. మఱియుం దచ్చూర్ణ విధంబెట్టిదనిన

కం. ఛందో గుణముల నియతిం
బొందక తాళ ప్రమాణమున గడు జెలువై
కొందరి చేం దచ్చూర్ణం
బందముగా తాళ గంధియన బొగడొందున్[1]

---

1. సంకీర్తన లక్షణం - 54, 55 పద్యాలు.

భరతుడు చెప్పిన అనిబద్ధమైన చూర్ణం ఇక్కడ తాళ్ళపాకవారు చెప్పిన చూర్ణం రెండూ ఒకటే. ఛందోగణాల నిర్దేశం లేకపోయినా కొంత వరకూ తాళ గతులు గల వచనాలను తచ్చూర్ణం అంటారనీ, అదే తాళగంధి అనీ లక్షణంలో చెప్పారు.

కృష్ణమాచార్యులు సింహగిరి వచనాలకు రాగనిర్దేశం చేయలేదు. సంకీర్తన లక్షణాలుగా పిలువబడుతున్న తాళ్ళపాక పెద తిరుమలాచార్య కృత శ్రీ వెంకటేశ్వర వైరాగ్య వచన మాలికా గీతాలకు రాగంతో బాటు తాళం కూడా నిర్దేశించారు. ఇవి వచనాలే అయినా గీతంగా పాడదగినవని గ్రంథనామంలోనే గ్రాహ్యం. ఇందులో ప్రతి వచనం కూడా "శ్రీ వేంకట గిరిదేవా!, నందకాయుధ ధరా!, నీలమేఘశ్యామలా!, పీతాంబరధరా!, పరమ పురుషా! వైజయంతీ వనమాలికాధరా!" అన్న శ్రీ మహా విష్ణు సంబోధనతో ఆరంభమై, శ్రీ వేంకటేశ్వరా!, అనే మకుటంతో ముగుస్తుంది.

తాళ గంధులు, చూర్ణం, విన్నపం అన్న వచన భేదాలకు శ్రీ వెంకటేశ్వర వైరాగ్య వచన మాలికా గీతాలు లక్ష్యాలుగా పేర్కొనవచ్చు. అయితే అక్కడక్కడ వచనాల్లో ప్రాచీనుల ప్రభావం కనిపిస్తుంది. తరువాత శఠగోప విన్నపాలు మొదలైన వచన కావ్యాలు వచన వాఙ్మయంలో కనిపిస్తాయి.

కృష్ణమాచార్యునితో వాఙ్మయంలో ఆరంభమైన వచనం తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని కాలానికి సర్వాలంకృతమై సమగ్రరూపం దాల్చింది.

# తృతీయ ప్రకరణం

## సంగీత గద్య ప్రబంధ లక్ష్య లక్షణ సమన్వయం

# సంగీత గద్య ప్రబంధ గాన లక్షణ పద్ధతులు

క్రిందటి ప్రకరణంలో చెప్పిన గద్య ప్రబంధాలకు తెలుగు సాహిత్యంలో సౌగంధికమైన కొన్ని వచనాలను ఉదాహరణ ప్రాయంగా గ్రహించవచ్చు. శార్ఙ్గ దేవుని రత్నాకరంలోని లక్షణానుసారంగా లక్ష్యాలు సంగీత శాస్త్రకారులు అందునా ప్రాయోగిక సంగీతం తెలిసినవారుగానీ, వాగ్గేయకారులుగానీ ఇవ్వగల సామర్థ్యం కలవారు. సంగీత నాట్య శాస్త్రాల్లో లక్ష్యాలనదగినవి లేకున్నా ఒకటీ అరా ఎంచవచ్చు. వాటిలో కూడా కొన్ని లక్షణాలను మాత్రమే అన్వయించడానికి వీలవుతుంది. గద్య ప్రబంధ గాన ప్రకారం సంగీత రత్నాకరంలో వివరణ:

"ప్రణవాద్య మతాలంచ అఖిలైర్గమకైర్యుతం॥
వర్ణైశ్చాతాల శబ్దానాం స్వరైరన్తేఽన్తరాంతరా
ప్రబంధాంకం సతాలంచ పదద్వంద్వం పృథక్ తతః॥
ద్విర్గీత్వా గీయతే యత్ర ప్రయోగోఽపి విలంబితః
గాత్రనామ సతాలంచ సతాలం వర్ణ్యనామ చ॥
విలంబితేన మానేన పునర ప్య విలంబితమ్
గీత్వావిలంబి తాలీన న్యాసో గద్యం తదిష్యతే॥"1

దీని వ్యాఖ్యాత సింహభూపాలుడు ఇలా వివరించాడు :

ప్రణవాద్యమిత్యాది = ప్రణవ ఓంకారః; అతాలం = తాళరహితం; అఖిలైర్గమకైః = తిరిపాదిభిః పంచదశభిః; వర్ణైశ్చేత్యత్రాప్యఖిలైరితి విశేషణీయమ్ అత్ర వర్ణశబ్దేన స్థాయాదయశ్చత్వారో వర్ణాఉచ్యంతే తైః యుతమితి చకారార్థః = అతాళ శబ్దానామంతే ఽన్తరాంతరా స్వరైర్యుతమిత్యన్వయః;

---

1. సంగీతరత్నాకరః - చతుర్థః - ప్రబంధాధ్యాయః - గద్యప్రబంధః పుట 272, 273.

అతాల శబ్దానాం = తాలరహితానాం వాచక పదానాంఒతే అవసానే సమాప్తా విత్యర్థః; అంతరాంతరా = మధ్యే మధ్యే పదావసానేష్విత్యర్థః అత్రస్వరైః = సరిగాదిభిర్యుతమ్ యథా, తథా గాతవ్య మిత్యర్థః తతోఽనంతరమ్ = ప్రబంధ నామాంకితమ్, సతాలం = ఏన కేనాపి తాలేన సహితం; పదద్వంద్వం = అవాంతరా నేకపద సముదాయాత్మక మేకైక విభక్త్యంతమేకైక క్రియయా సమన్వితం వా శబ్దరూప ద్వితయమ్. పృథక్ ద్విర్గీత్వేత్యనేన = ప్రథమ పదం ద్వివారం గీత్వా ద్వితీయ పదమపి ద్వివారం గాయే దిత్యర్థః ప్రబం ధాంకమిత్యస్య పదద్వంద్వమితి సముదాయ విశేషణత్వేన ద్వయోః పదయో రేకతరస్మిన్ ప్రబంధస్య నామాంకయే దిత్యర్థః.............................. ................ ............... ..........పదస్వర తాళ బద్ధత్వాత్ త్యంగః భావనీ జాతిమాన్"

................తేషాం గానప్రకారమాహ ప్రణవాద్యమితి। ప్రబంధకం పూర్వం గాయేత్ ఉద్గ్రాహ రూపమిత్యర్థః। తస్య విశేషణాని ప్రణవాద్య మిత్యాదీని। ప్రణవ ఓంకార ఆదౌయస్య। అతాలం తాల వర్జితమ్। సర్వైరపి గమకై ర్యుక్తమ్! అతాల శబ్దానాం వర్ణైః పాదాక్షరై ర్యుక్తమ్ అంతే మధ్యేచ స్వరై ర్యుక్తమ్ ఏవం విధం ప్రబంధకం తతః సతాలం పదద్వయం పృథక్ ద్విర్గీత్వా విలంబితః ప్రయోగో గమక సందర్భో గీయతే తతోఽనంతరం సతాలం గాతుర్వాగ్గేయ కారస్య వర్ణస్య గాయకస్య చ నామ తచ్చ విలంబిత మానేన తతోఽనంతరం తదేవ గీత్వా గాతృ నాయకయోర్నామా విలంబితం గీత్వాపునరపి విలంబితేన సమాప్తి ర్యత్ర, తద్గద్య మిత్యుచ్యతే."

**తెలుగు అనువాదం :**

"ఓంకారం ఆదియందు కలది, తాళ వర్జితమైనదీ, అఖిల గమకములతో నున్నదీ, తాళ రహితములగు శబ్దముల, అక్షరములతో కూడినదీ, అంత్యా మునందూ మధ్య భాగమునందూ, స్వరములతో కూడినదీ, ప్రబంధక మగును. ఇట్టి ప్రబంధకము సతాళకముగా పదద్వయమును విడివిడిగా విలంబిత ప్రయో గముగా గమక సందర్భముతో గానము చేయబడును. గాయకుని పేరూ, నాయకుని పేరూ సతాళముగా విలంబితముగా గానము చేయబడును. దీనిని మరల పాడి అటుపైని గాయక, నాయక, నామములను అవిలంబితముగా గానముచేసి తిరిగి విలంబితముగా సమాప్తి చేయవలెను. దీనిని గద్యమందురు."[1]

1. అనువాదకర్త - ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారు.

ఆంగ్లంలో శ్రీ ఆర్. రంగ రామానుజ అయ్యంగార్:

"Gadya was the third among the twenty four Āli[1] Prabandhas. It was a string of words with no rhyme or metre, a prose composition, easy, free from hard letters and with few compounds, but interspersed with vignetts of verse It was tri-Dhātu and Aniryukta for the most part. Though swara and pada were its two dominent Angās, Tala was a back door entrant. So the Prabandha was of Bhāvani jāti.

Utkalika, Choorna, Lalita, Vrutta Gandhi Khanda and Chitra, elements gleaned from Samaveda, were like the sixteeth of this Prabandha figuratively speaking.................................................................................

In conclusion, Gadya Prabandha was tri-Dhātu and of Bhāvani jāti. It was one of the manifestations of Omkāra, so it had to be approached with devotion and humility the fifteen Principal Gamakās, the four elements of varna (old style), viz , Sthāyi (karvai), Ārohi, Avarohi and Sanchgri Sthāyi (karvai), Ārohi, Avarohi and Sanchāri putting together the three above elements in a melody phrase composed swarās."

## దీనికి భావానువాదం :

24 విధాలలో మూడవ విభాగం గద్య ప్రబంధం. ఈ గద్య ప్రబంధం ఛందస్సుగానీ లయగానీ, మాటల కూర్పు (పాట వంటి పదబంధం) గానీ లేని కేవల వచన రచన. సులభశైలి కలిగి ఉండాలి. బరువైన లక్షణాలూ, దీర్ఘ సమాసాలూ ఉండకూడదు. ఈ గద్య ప్రబంధం త్రిధాతుకం, అనిర్యుక్తం.

1. A study of Sangeeta Ratnakara.

ఇందులో స్వరం, పదం అనే అంగాలు ప్రాధాన్యం వహిస్తాయి. తాళం అక్కడక్కడా ఉంటుంది. అందుకని దీనిని పండితులు భావనీజాతి ప్రబంధానికి చెందినదని అన్నారు.

ఉత్కళిక, చూర్ణం, లలితం, వృత్తగంధి, ఖండం, చిత్రం అనే అంశాలను సామవేదం నుండి సంగ్రహించారు. ఈ గద్య ప్రబంధ రీతులతో కొన్ని రచనలు తమ కాలంనాటికి ఉండేవని శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు.

పంచదశ గమకాలు, స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారీ అనే ప్రాచీన వర్ణ ప్రక్రియా గానానికి అవసరమయ్యే అంశాలు అంటే ఈ అంశాలతో గుదిగుచ్చబడిన స్వరాలతో కూడిన రాగ స్వరూపాన్ని సంచారం ద్వారా ప్రదర్శించవలెను. అనిర్యుక్తమైన ఈ గద్య ప్రబంధం ఉద్గ్రాహం, ఆభోగం ధ్రువం వంటి ధాతువులతో కూడి ఉంటుంది.

ప్రారంభ మాతువుకు చేర్చవలసిన ప్రారంభ ధాతువును ప్రబంధ శరీరంలో (అచ్ఛాదన సంగీతం) ఉద్గ్రాహం, ధ్రువం, ఆభోగం మాతువులోని వేరు వేరు పరిచ్ఛేదాలను కలుపుకుంటూ ప్రబంధం చివర అంకితపు (నాయక నామం) ముద్రగానీ, వాగ్గేయకార (నామ) ముద్రగానీ ఉంటుంది.

గద్యప్రబంధ రూపం ఈ మాతు భాగాలకు ముందూ, మధ్యా, తోడు తోనూ, చివరా, యుక్తమైన తాన, ఆలాపాది ధాతు విభాగాలను మేళవించినపుడే గద్యప్రబంధ పూర్ణ రూపం సిద్ధిస్తుంది. ప్రణవ నాదం అనగా ఓంకార ప్రభావం సంపూర్ణంగా వినియుక్తమయ్యే అవకాశం గలది గద్యప్రబంధ గానం."1

## ప్రబంధ గానసమన్వయం :

పై చెప్పిన విధంగా సంస్కృత, ఆంగ్ల విమర్శల్లో గద్యప్రబంధ స్వరూపం సమన్వయపరిస్తే స్థూలంగా ఇలా చెప్పవచ్చు:

---

1. భావానువాదం - ఆచార్య బాలాంత్రపు రజనీకాంతరావు గారు.

ఓంకారంతో ఆరంభమై, తాళవర్జితమైనా, అక్కడక్కడా లయాన్వితమై తాళం ఉన్నదీ అయిన గద్యప్రబంధం మధ్య భాగంలో స్వరాలతో కూడి ఉంటుంది. పంచ దశ గమకాలతో కూడినదై ఓంకార నాదం సంపూర్ణంగా వినియోగం ఈ గద్యప్రబంధంలోనే పొందింది. ఇది సమస్త ప్రాచీన సంగీత సంప్రదాయ లక్షణాలతో కూడినది. ఉత్కళిక, చూర్ణం, లలితాది గద్య ప్రబంధాలు సామవేదం నుండి గ్రహించారనీ, ఆయా ప్రబంధ రీతుల్లో రచనలు శార్ఙ్గదేవుని కాలం నాటికే ఉన్నాయనీ శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు. శార్ఙ్గదేవుని కాలం నాటికి మార్గ సంగీత పద్ధతులు ఇంకా జన వ్యవహారంలో ఉన్నాయనీ దీన్నిబట్టి సుస్పష్టమౌతోంది. ఇప్పుడట్టి సంప్రదాయం మృగ్యం.

ప్రబంధమనే శరీరంలో అంగ, ధాతువులు విభిన్న భాగాలుగా ఒకదానికొకటి కలుపుకుంటూ గేయకార నామధేయంతో శార్ఙ్గదేవుని కాలం నాటికి గద్య ప్రబంధం పరిపూర్ణత్వం పొందిందని స్పష్టమౌతోంది.

## లక్ష్య లక్షణ సమీకరణం :

ఈ గద్య ప్రబంధ లక్షణాలకు సాహిత్యంలోని వచనాలను ఉదాహరణగా గ్రహించవచ్చు.

సంగీతజ్ఞుడు, కవి సార్వభౌముడయిన శ్రీనాథుని కావ్యాల్లో అతని సంగీతజ్ఞత్వం ప్రకటించినట్లుగానే అక్కడక్కడా ఉత్కళిక, చూర్ణిక, లలిత గద్యల లక్షణాలకు లక్ష్యాలని సూచనాప్రాయంగా చెప్పడానికి వీలున్న వచన రచనలు చేసాడు. శ్రీనాథుని కావ్యాల్లో వచనాలకు ఒక ప్రత్యేకత ఉంది. అవి కావ్యంలో కథనాన్ని ప్రకటిస్తాయి. కావ్య ప్రయోజనాన్ని సాధించడంలో తమ వంతు ప్రయత్నం జరిపినట్లుగా కనిపిస్తాయి.

దీర్ఘ వర్ణనలకూ యుద్ధ వర్ణనలకే గాక నాయిక శృంగార విరహ భావాల్ని వర్ణించే సందర్భాలలో కూడా ఉత్కళికా ప్రాయాలైన వచనాలు ఇతని రచనలో కనిపిస్తాయి.

సాహిత్య లక్షణ కారులు ఇచ్చిన రీతీ, వృత్తి రసాభివ్యక్తీకరణాది లక్షణాలు సంగీతకారులు ఈ గద్య ప్రబంధాలకు పేర్కొన్నారు. ఈ లక్షణాలు భాషననుసరించి వ్యక్తమయ్యేవి.

సాహిత్యంలో కావ్య వచనాల్లో ఒకే వచనంలో రెండు విధాలైన రచనా రీతి గోచరిస్తూంటుంది. ఈ విధంగా ఉత్కళిక, చూర్ణికల లక్షణాలు శ్రీనాథుని రచనలో కనిపిస్తాయి.

**ఉత్కళిక లక్షణం**:-వీరరసం, గౌడీరీతి, ఆరభటీ వృత్తి, రుద్రదైవతం, రక్తవర్ణం ఇవి సంగీతకారులు పేర్కొన్న లక్షణాలు.

సాహిత్య విమర్శలో లక్షణాలివి:

"అత్యుద్ధతార్థ సందర్భా వృత్తిరారభటీ స్మృతా"[1]

ఉద్ధతమైన అర్థాన్ని చెప్పే సందర్భాలలో ఆరభటీ వృత్తి చెప్పుకోదగినది. ఉద్ధతమైన రసాలు వీర రౌద్రాలు. రసస్ఫోరకాలైన పద సంయోజనం, పరుషాక్షరాలతోకూడి ఉండాలి. దీర్ఘసమాసయుతమై ఉండాలి. అప్పుడది గౌడరీతి అవుతుంది. ఇటువంటి లక్షణాలున్న రచనను ఉత్కళికగా పేర్కొనవచ్చు.

శ్రీనాథుని కాశీఖండంలో నారదమహర్షితో వింధ్యశిఖరి తన ప్రతిస్పర్థిగా మేరువును సూచిస్తూ తామిద్దరిలో ఎవరు గొప్పో పక్షపాత వైఖరిలేకుండా చెప్పమని అడిగిన సందర్భంలో ఉన్న క్రింది వచనం ఉత్కళికాప్రాయం.

"..................................
................................ ...."

ఎనిమిది దిక్కుంజరంబులకు దిక్కైన కూర్మంబునకు, నర్మిలియై క్రీడా క్రోడంబునకు దోడై .... .... .... .... .... .... .... .... .... .... ....
మహేంద్ర నిషధ ద్రోణంబులు దరిద్రాణంబులు హేమ కూటంబు గిట గిటన, తక్కుఁ జిఱుకొండల బేర్కొనం గారణంబేమి? ఇప్పుడిప్పాట నాతోడం బ్రతి ఘటింపఁగలయది సురగరుడ ఖచర విద్యాధర యక్ష కిన్నర గంధర్వ దర్వీకరాశ్రయంబును కల్పతరువాటి కామ ధుగ్ధేను మండలంబును, విబుధ వేదండ శుండాదండ చుళికితో ద్గీర్ణస్వర్ణదీకాండ గండూషిత బ్రహ్మాండ గోళంబును నగు సుమేరు శైలంబు.... .... .... .... .... .... .... ...."[2]
ఇది మొదట అలతి పదాలతో చూర్ణికగా భాసించినా తరువాత పర్వత దర్ప వర్ణన దీర్ఘ సమాసాలతో కూడి ఉత్కళికా ప్రాయమైంది.

---

1. కావ్యాలంకార సంగ్రహం-ద్వితీయాశ్వాసం-పుట 171.
2. కాశీఖండం - ప్రథమాశ్వాసం. 100 వచనం.

మరొకచోట గుణనిధి తండ్రి యజ్ఞదత్తుడు శివధ్యానం చేసి త్ర్యంబకుని వలన దివ్యదృష్టిని పొందిన సందర్భంలో ఉన్న వచనంలో కూడా ఉత్కళికా లక్షణాలు కనిపిస్తాయి.

అవ్విధంబున యాజ్ఞదత్తి విజాతీయ ప్రత్యయాన్యరహిత సజాతీయ ప్రత్యయ సంతానానువృత్తి రూపంబైన నిది ధ్యానంబున నివాత నిష్కంప దీపంబునుం బోలెఁ బెద్దకాలంబు కాలకంఠు మంగళ జ్యోతిర్లింగమూర్తి నంత రంగంబున జపంబు సేయుచుండిన నా ఖండేందు మౌళి ప్రసన్నుండై వత్స! వరంబు వేడు మనిన........................................—.........
ప్రణవాది మంత్రంబుల నారాధించి యంజలిపుటంబు లలాటతటంబున ఘటియించి నిర్నిరోధ నిరవగాధ కరుణాసుధా పూరపూరితాంతఃకరణ! శరణ్య, దేవతాకోటి కోటీర కోటీ ఘటితమణిమయూఖ లేఖాపుంజకింజల్కితంబులు, త్రయ్యంత విద్యాసీమంతినీ సీమంత సీమా సిందూర పరాగపాటలంబులు, కుటిల కృతాంత దంతతాడనక్రీడా నిష్కృపంబులగు మీ శ్రీపాదపద్మంబులు దర్శించునట్టి సామర్థ్యంబుఁ గృపసేయవే! ! . . ; . . . . . ఇలా సాగుతుంది వచనం.

ఇందులో ఈశ్వరుడు అధిపతి, భగవద్దైవతాకం. అతని సంబంధి గుణ వర్ణన చేశాడు.

హరవిలాసం తృతీయాశ్వాసంలో—

శైలసుతయందు పరమేశ్వరుని మనసు లగ్నం అయ్యేటట్లు చేసిన మదనుని భస్మీపటలం చేసినఘట్టం వచనంలో వర్ణితమైంది.

"అనంతరం బంతక మదనుండ తర్కితంబైన ఇంద్రియ క్షోభంబు బలాత్కారంబుగా గుదియించి చేతోవికారంబునకుం గారణంబు దెలియం దలంచి . . . . . . . . . . . . . . . . . . తవః వరామర్శ వివృద్ధక్రోధుం డయ్యె నవ్వేళ భ్రూభంగదుష్ప్రేక్షంబగు విరూపాక్షుని లలాటేక్షణంబునం జనియించిన సముజ్జ్వల జ్వాలా జాలంబైన కృపీటయోని భువనంబులెల్ల భయ భ్రాంతంబులై హాహాకారంబులు సేయ . . . . . . . . . . . . . . . ."[2]

1. కాశీఖండం - చతుర్థాశ్వాసం - వచనం 142.
2. హరవిలాసం - తృతీయాశ్వాసం - వచనం 82.

ఈ విధంగా గంభీర శబ్దాలతో కూడిన సమాసాలతో ఈ వచనం ఉంటుంది.

గద్యం అలతి పదాలతో ఉండాలనే నియమం ఉత్కళిక గద్యలో కుద రదు. నిర్దేశించిన లక్షణాలను అన్వయించడంలో కొంత వ్యతిరేకత కనిపి స్తోంది. బహుశః అంత సుదీర్ఘ సమాసాల ప్రయోగం అర్థం భాసించడంలో దీర్ఘత కనబడ కూడదనేమో!

అన్ని గద్యల్లో అన్ని లక్షణాలకూ లక్ష్యాలను చూపడం అసాధ్యం కాబట్టి ఈ లక్షణాలు ఉన్న వాటిలో కొంత భిన్నత్వం గోచరించినా ఇవి సాహిత్య విమర్శకులు చెప్పిన లక్షణాలకు ఏమాత్రం తీసిపోనివి. ఇది సమ న్వయ పరచడంలో గోచరించిన లక్షణం.

సంగీత గద్యప్రబంధ లక్షణాలకు లక్ష్యప్రాయాలని సాహిత్య వచనా లను చెప్పవచ్చు. ఛందస్సులేని వచన రచన లివి. ధాత్వంగాలు లేని వచ నాలూ, విమర్శపరమైన లక్షణాలు కూడా కొన్ని మాత్రమే పరిశీలనలో సరిపో గలవు. వృత్తి, రీతీ, అధిపతీ, రసం మొదలైన లక్షణాలు పూర్తిగా ఉన్న ఉదాహరణలు వాగ్గేయకారుల రచనల్లో కూడా అంతగా కనిపించవు.

పోతన భాగవతంలో శ్రీహరి నరసింహ రూపంలో స్థంభం నుండి ఆవిర్భవించే ఘట్టంలోని వచనం ఉత్కళికకు దీటైనదని చెప్పదగినది.

"ఇట్లు దానవేంద్రుడు పరిగృహ్యా మాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘ్యమైన విజ్ఞాన వినయుండును, వినయగాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును, హృదయ చాంచల్యా మాన తామసుండును దామస గుణచంక్రమ్య మాణ స్థైర్యుండునునై, విస్ఫురిత మున హుంకరించి.................. ........................................

దిశదిశలను మిడుంగురులు చెదరంజిటిలి పెటిలిపడి, బంభజ్యమానంబగు నమ్మహా స్థంభంబు వలన ప్రళయవేళా సంభూత సప్తస్కంధ బంధుర సమీరణ సంఘటిత ఘోర ఝోఘుష్యమాణ..........................................

.... .... .... .... .... .... . . . . . . . . . . . . . . . ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాం తరంగ బహిరంగ జేగీయమాన కరుణ వీర రసం యుతుండును, మహా ప్రభావుండును నైన శ్రీ నృసింహ దేవుం డావిర్భ వించిన గనుంగొని."1

ఇటువంటి సుదీర్ఘమైన సమాసాలతో పోతన వచన రచన అత్యంత రామణీయకం. నృసింహుడు స్థంభం నుండి ఉద్భవించడం వర్ణించిన తీరు ఇందులో దృగ్గోచరం అవుతుంది.

ఇందులో అధిపతి విష్ణువు-రౌద్రమూర్తి-రౌద్రరసం. ఆ రౌద్రమూర్తి అవిర్భావ వర్ణనం. ఈ వచనం ఉత్కళికా లక్షణంలో రుద్ర దైవతాకం, రక్తవర్ణం ఇత్యాదులతో కూడి ఉంది. భగవంతుడు ఏ రూపంలోనైనా ఉండ వచ్చునే ధోరణిలో రౌద్రరూపుడు విష్ణువు 'శివాయ విష్ణు రూపాయ శివ రూపాయ విష్ణవే' అన్న ఆ మాట ఈ వచనం రుజువు చేస్తోంది. ఈ వచనా నికి సంగీత ఉత్కళిక లక్షణాలు సరిగ్గా సరిపోతాయి. భావానుగుణంగా భాష, అరభటీవృత్తి, గౌడీ రీతిలో రచన సరిపోయిన లక్షణాలు.

ఈ క్రింది వచనంలో హరిని చిత్తంలో తలంచనివారు చింతా తత్పరు లౌదురని వివరించాడు.

వేదాంత పరమైన వస్తువైనప్పటికీ ఈ వచనం ఉత్కళికా ప్రాయ మైంది. దీర్ఘసమాసాలతో భాసితమౌతోంది. ఇందు భగవంతుడే నాయకుడు, శాంతమే రసం. దీర్ఘసమాసయుతమై కఠిన పదాలతో ఉన్న రచనా రీతి ఇందులో కనిపిస్తుంది.

"మరియు హరిచరణ కమల గంధ రసాస్వాదనం బెఱుంగని వారలు నిజ కర్మబంధంబుల దండ ధర మందిర ద్వార గేహళీ సమీప జాజ్వల్యమాన వైతరణీ తరంగిణీ దహన దారుణ జ్వాలా జాల దందహ్యమాన దేహులం గూడి శిఖిశిఖావ గాహంబుల నొందుచుండుదురు. మరియు విజ్ఞాన సంపన్నులై

1. భాగవతం - సప్తమస్కంధం - 285 వ వచనం.

మన్న ప్రపన్నులు మాయాపన్నులుగాక .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... మహాయోగి రాజ విలసిత హృదయ కమల కర్ణికా మధ్య సంస్థాపిత విలసిత చరణ కిసలయుండును, సంతతానందమయుండును, సహస్రకోటి సూర్య సంఘాత సన్నిభుండును .... .... .... .... .... .... .... .... ....[1]

అయినటువంటి పరమేశ్వరుని మనసులో నిలుపుకొన్నవారు ఎంత కాలం వరకూ నిరంతర ధ్యానాసక్తులౌతారో అంతకాలం వరకూ అతని యందు చింతా తత్పరులౌతారని ఇందులోని భావం.

మరొక వచనంలో భీషణాకృతితో మహావిష్ణువు హిరణ్యకశిపుని చంపే విధం వర్ణించారు.

"ఇట్లు కేవల పురుషరూపంబును, మృగరూపంబును గాని నరసింహ రూపంబున, రేయునుంబవలునుంగాని సంధ్యాసమయంబున నంతరంగంబును, బహిరంగంబునుంగాని సభాద్వారంబున, గగనంబునుం భూమియునుంగాని యూరు మధ్యంబున ప్రాణ సహితంబులును, ప్రాణ రహితంబులునుగాని నఖంబులం ద్రైలోక్య జన హృదయశల్లుంతయిన దైత్య మల్లుని వధియించి మహాదహన కీలాభీల దర్శనుండును, గరాళవదనుండును, లేలిహాన భీషణ జిహ్వుండును, శోణిత పంకాంకిత కేసరుండునునై ప్రేవులు కంఠ మాలి కలుగ ధరించి కుంభి కుంభ విదళనంబు నేసి చనుదెంచు పంచాననంబునుం బోలె దనుజ కుంజర హృదయ కమల విదళనంబు సేసి తదీయ రక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగ రక్త చంద్రరేఖల చెలువు వహింప, సహింపక, లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని, తత్తరంబున రణంబునకు నుర వడించు రక్కసులం బెక్కు సహస్రంబులఁ జక్రాదిక నిర్వక్రసాధనంబుల నొక్కని జిక్కకుండఁజక్కడిచె నివ్విధంబున___"[2]

---

1. భాగవతం - ద్వితీయ స్కంధం - 26వ వచనం.
2. భాగవతం - సప్తమస్కంధం - 299వ వచనం.

హిరణ్యకశిపుని సంహరించి ఆతని ప్రేవులు మాలగా ధరించిన ఆ రక్తసిక్త నఖాలతో విష్ణువు మిగిలిన రాక్షసులను సంహరించుట ఇందలి వస్తువు.

బీభత్స రసప్రధానంగా ఈ వచనం సాగుతుంది ఆరభటీ వృత్తి కలిగి రక్తవర్ణం కలదై, గౌడీ రీతిలో భాష ఉండి, సంగీత గద్యప్రబంధ భేదం అయిన ఉత్కళికకు లక్ష్యం అనదగినది.

**ఇక చూర్ణిక లక్షణం:** వేదాంత ధర్మాన్ని బోధిస్తూ ఉండాలి. సంబోధనాత్మకంగా ఉండాలి. గంభీర భావంకానీ, శైలీ ప్రాధాన్యంకానీ, కథా వైశిష్ట్యం కానీ లేనప్పుడు చూర్ణికను ప్రయోగించవచ్చు. చూర్ణిక కథా కథనానికి తోడ్పడుతుంది. ముఖ్య పాత్ర చిత్రణం ఇందులో అంతగా ఉండకపోవచ్చు. ప్రత్యక్ష వస్తు వివరణ, సుబోధక భావం, శైలీ సౌలభ్యం చూర్ణిక ప్రధాన లక్షణాలు. స్తుతి పరమైన వచనాలు కూడా చూర్ణికలుగా భాసిస్తాయి.

అగస్త్యుడు లక్ష్మీదేవిని స్తుతించే సందర్భంలో—

"పరమార్థ వస్తు విభాగంబు సేయవచ్చిన శక్తిమంతుండైన యీశ్వరునకు శక్తియగు నీకు భేదంబు లేదు, కావున శక్తుండగు నీశ్వరునకుం గల సృష్టి స్థితి సంహృతి స్వభావ స్వరూపంబులైన కృత్యంబులైదును నీయవి—

.... .... .... ... .... ..... ..... ..... .... .... ....

భోగాపవర్గ లక్షణంబైన ఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కిచ్చునపుడు నిన్ను మున్నిడుకొని గాని యీజాలడు. శబ్ద బ్రహ్మంబు కారణ బిందాత్మకంబై బిందు నిష్యందత్వంబునకుం బురుషచ్ఛాయా ప్రయత్నంబున మూలాధారావస్థిత పవన సంధుక్షణంబునం జేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు—

.... .... .... .... .... .... .... ఈ చతుర్విధ సూక్ష్మ స్థూల మాతృకా స్వరూపవిట్టి దేవీ! నీకు నమస్కారంబు"[1]

---

1. కాశీఖండం - తృతీయాశ్వాసం - వచనం 50.

ఈ విధంగా చతుర్విధాలైన పరా, పశ్యంతి, మధ్యమా వైఖరీ వాక్స్వరూపమైన లక్ష్మీదేవిని అగస్త్యర్షి స్తుతించినట్లుగా కాశీఖండంలో శ్రీనాథునిచే వర్ణితమైంది. ఈ వచనంవేదాంత సంబంధి వస్తువుగా గలది. చూర్ణికాప్రాయం.

"ఎయ్యది సంసార తారకంబగుటఁ దారకం బయ్యె? ఎయ్యది ప్రకర్షంబునంజేసి యశేష విక్రియా విరహంబునం గూటస్థ నిత్యంబయ్యును పరమానంద ప్రకాశంబున సర్వదా యభినవంబగు పరబ్రహ్మంబునకు వాచకంబగుట ప్రణవాభిధానంబు వహించె......................అట్టి యోంకార మంత్రత్వంబు దివ్యలింగ స్వరూపంబై యావిర్భవించినం గనుంగొని పంకజాసనుండు నమ ఓంకార స్వరూపాయ నమస్సర్వ రూప స్వరూపిణే.......................... నమోభక్త విషాద హంత్రే నమో నమయని అనేక ప్రకారంబులం ప్రస్తుతించిన"[1]

అకార ఓంకార బిందు నాదాత్మకమైన "ఓం" యొక్క మాతృకకు కారణమైందీ, జాగృతి సుషుప్తి మొదలైన అవస్థలకంటె, తురీయాతీత సమాధి గతమైందీ, ప్రపంచ సర్వకర్మ రూపం, కరణ క్రియా రూపాలన్నింటికీ ఆత్మభూతమైందీ పరమేశ్వర సంభూతమైన ఓంకార మంత్ర రూపం దివ్యలింగ స్వరూపమై ఆవిర్భవించినదట. ఆ దివ్యలింగాన్ని పలువిధాలుగా అగస్త్యుడు స్తుతించడం ఈ వచనంలోని వస్తువు.

చరాచర ప్రపంచం ఈశ్వరాత్మకమని తెలియజేసే యీ వచనం వేదాంత విషయకమైందీ, చూర్ణికాప్రాయమైంది.

---

1. కాశీఖండం - షష్ఠాశ్వాసం - 250వ వచనం.
2. భాగవతం - సప్తమస్కంధం - 356 వ వచనం.

"దేవా! మునీంద్రులు నిజ విముక్తకాములయి, విజనస్థలంబులం దపంబు లాచరింతురు, కాముకత్వంబు నొల్లకయుండు వారికి నీ కంటె నొండు శరణంబు లేదు.........................తత్వజ్ఞులయిన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని, వేదాంత ప్రతిపాద్యుండవగు నిన్ను సమాధి విశేషంబుల నెఱింగి సేవింతురు..............[2]

దేవా! సకల యోనులందును సుఖ వియోగ దుఃఖ సంయోగజనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై, దుఃఖ నివారకంబుగాని దేహాద్యభిమానంబున మోహితుండనై, పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు, సఖుండవు, పరమదేవతవునైన నీయొక్క బ్రహ్మ గీతంబులైన లీలావతార కథా విశేషంబులఁ బఠియించుచు, రాగాది నిర్ముక్తుండనై, దుఃఖపుంజంబులఁ దరించి, భవదీయ చరణ కమల స్మరణసేవా నిపుణులైన భక్తుల జేరియుండెద. బాలునిం దల్లిదండ్రులును, రోగిని వైద్య దత్తంబైన యౌషధంబును, సముద్రంబున మునింగెడు వాని నావయును, దక్కనొరులు రక్షింపలేని తెఱంగున సంసార తాపసంతప్యమానుండై నీచేత నుపేక్షితుండైన వాని నుద్ధరింపనీ వుదక్క నన్యుండు సమర్థుండు గాడు. జగంబుల నెవ్వం డేమి కృత్యంబు నెవ్వని చేతం బ్రేరితుండై యే యింద్రియంబులం జేసి యేమిటి కొఱకు నెవ్వనికి సంబంధియై యే స్థలంబున నే సమయంబునం దేమి రూపమున నేగుణంబున నపరంబైన జనకాది భావంబున నుత్పాదించి, వరంబైన బ్రహ్మాది భావంబున రూపాంతరంబు నొందించునట్టి వివిధ ప్రకారంబులన్నియునీవ. నిత్యముక్తుండవు, రక్షకుండవునైన నీయంశంబైన పురుషునికి నీ యనుగ్రహంబునఁగాలంబు చేతం బ్రేరితయై కర్మ మయంబును, బలయుతంబును ప్రధాన లింగంబునునైన మనంబును, నీ మాయ సృజించు అవి

---

1. భాగవతం - సప్తమస్కంధం - 360 వ వచనం.
2. భాగవతం - సప్తమస్కంధం - 366 వ వచనం.

ద్యాశ్రిత వికారంబును, వేదోక్త కర్మ ప్రధానంబును, సంసార చక్రాత్మకంబునునైన యీ మనమును నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండులేఁడు విజ్ఞాన నిర్జిత బుద్ధి గుణుండవు నీవు. నీ వలన వశీకృత కార్యసాధనశక్తియైన కాలంబు, మాయతోడం గూడషోడశ వికార యుక్తంబైన సంసార చక్రంబు జేయుచుండు సంసార దావదహన సంతప్యమానుండ నగు నన్ను రక్షింపుము.[1]

మహాత్మా! సుజనులైన బ్రహ్మాదులందును, దుర్జనులైన మా యందును సేవానురూపంబునం బక్షా పక్షంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫల ప్రదానంబు సేయుదువు.... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... ..... .... ..... .... .... ....

విశ్వంబు నీవ. గుణాత్మకంబైన విశ్వంబు సృజియించి, యందుం బ్రవేశించి, హేతుభూత గుణయుక్తుండవై, రక్షక సంహారకాది నానా రూపంబుల నుండుదువు. సదసత్కారణ కార్యాత్మకంబైన విశ్వంబునకుం బరమ కారణంబు నీవ. నీమాయచేత వీడుఁ దాననియెడి బుద్ధి వికల్పంబు దోఁచుఁ గాని, నీకంటె నొండెద్దియు లేదు. బీజంబునందు వస్తుమాత్ర భూత సౌక్ష్యంబును, వృక్షంబునందు నీలత్వాది వర్ణంబును గలుగు తెఱంగున, విశ్వంబునకు నీయంద జన్మస్థితి ప్రకాశనాశంబులు గలుగు. నీచేతనైన విశ్వంబు నీయంద నిలుపుకొని, తొల్లి ప్రళయకాల పారావారంబున బన్నగేంద్ర పర్యంకంబునఁగ్రియా రహితుండవై, నిజ సుఖానుభవంబు సేయుచు, నిద్రితునిభంగి యోగనిమీలిత లోచనుండవై యుండుచు, గొంత కాలంబునకు నిజకాలశక్తిచేతఁ బ్రేరితంబులై, ప్రకృతి ధర్మంబులైన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి చాలించి వెలుంగుచున్న నీ నాభియందు, వటబీజమువలన నుద్భవించు వటంబు తెఱంగున, నొక్క కమలంబు సంభవించె. అట్టి కమలంబున నాల్గుమోముల బ్రహ్మ జన్మించి, దిశలు వీక్షించి, కమలంబునకు నొండైన రూపంబు లేకుండుట చింతించి, జలాంత

1. భాగవతం - సప్తమస్కంధం - 356 వచనం.

రాళంబు ప్రవేశించి, జలంబులందు నూఱు దివ్య వత్సరంబులు వెదకి, తన జన్మంబున కుపాదాన కారణంబైన నిన్ను దర్శింప సమర్థుండుగాక, మగిడి కమలంబు కడకుంజని, విస్మయంబు నొంది, చిరకాలంబు నిర్భరతపంబుచేసి పృథివియందు గంధంబుగను చందంబునఁ దనయందు నానా సహస్ర వదన శిరోనయన నాసాకర్ణవక్త్రి భుజకర చరణుండును, బహు విధాభరణుండును ................బురుషో త్తముండునునైన నిన్ను దర్శించె.[1]

భగవంతుని స్తుతి వచనాలు:

"మఱియు భక్తధనుండును నివృత్త ధర్మార్థ కామ విషయుండును, నాత్మారాముండును, రాగాదిరహితుండును గైవల్యదాన సమర్థుండును గాలరూప కుండును నియామకుండును నాద్యంత శూన్యుండును విభుండును సర్వసముం డునుసకలభూత నిగ్రహానుగ్రహకరుండునునైన నిన్ను దలంచి నమస్కరించెద నవధరింపుము. మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వండు సమర్థుండు. నీకు బ్రియా ప్రియులు లేరు. జన్మ కర్మ శూన్యుండ వైన నీవు తిర్యగాది జీవులయందు వరాహాది రూపంబులను, మనుష్యులందు రామాదిరూపంబులను, ఋషులయందు వామనాది రూపంబులను, జలచరంబుల యందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మ సంహితుండవగుటం గాదు."[2]

భగవంతుడు ఎవరికి ఏ రూపంలో సాక్షాత్కరిస్తాడో వివరించిన ఈ వచనం చూర్ణికాప్రాయం. ఇటువంటి వచనాలలో శ్రీ మహావిష్ణువు పరబ్రహ్మగా దైవం, శాంతం రసంగా భాసిల్లుతుంది.

"దేవా! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారలమైన మమ్ము విడిచి విచ్చేయనేల నీ కరుణావలోకనంబుల నిత్యంబును జూడవేసి యాదవ సహితులైన పాండవులు జీవుని బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తి సంపదలు లేక తుచ్ఛత్వంబు నొందు దురు. కల్యాణ లక్షణ లక్షితంబులయిన నీ యడుగుల చేత నంకితంబయిన

1. భాగవతం - సప్తమస్కంధం - 360
2. భాగవతం - ప్రథమస్కంధం - 191వ వచనం.

మదీయ ధరణీ మండలంబు నీవు వాసిన శోభితంబుగాదు; నీ కృపా వీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు కుసుమ ఫలభరితంబులై యోషధి తరులతాగుల్మ నదనదీ సమేతంబులై యుండు."[1]

సంబోధనతో ఆరంభమైన ఈ వచనం స్తుతి వచనమే. ఇందులో నాయకుడు భగవంతుడు. అతని కృపాకటాక్ష వీక్షణాలతో ప్రపంచమంతా చైతన్యవంతమగునని ఈ వచనంలో వివరించాడు. ఇది చూర్ణికాప్రాయం.

క్రింది వచనంలో ఈశ్వరమయమైన ఈ విశ్వంలో జీవుని పరిణామ క్రమం ఏవిధంగా ఉంటుందో వివరించాడు. ఇది వేదాంతపరమైన వచనం.

అనిన విని సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె "నీశ్వర వశంబు విశ్వంబీశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁజేర్చు నెడఁబాపు సూచీ భిన్న నాసికలందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠ రజ్జువుల గట్టంబడిన బలీవర్దంబులుంబోలెఁ గర్తృ వ్యాకర్తవ్య వేద లక్షణయగు వాక్తంత్రియందు వర్ణాశ్రమ లక్షణంబులు గల నామంబులచే బద్ధులై లోకపాల సంహితంబైన లోకంబీశ్వరాదేశంబు వహించు.. .... .... .... .... .... .... .... .... .... .... .... ....అజ్ఞాన మూలంబగు స్నేహంబుననైన మనోవ్యాకులత్వంబు పరిహరింపుము.[2]

పై వచనం వంటిదే మరొక వచనం వేదాంతపరమైనది. మోక్షాన్ని జయించడానికి జీవుడు చేయవలసిన క్రియాదికం ఇందు వివరించిన వస్తువు.

"వినుము నీకు నేడు దివసంబులకుం గాని జీవితాంతంబు గాదు; తావత్కాలంబునకుం బారలౌకిక సాధన భూతంబగు పరమ కల్యాణంబు సంపాదింపవచ్చు; నంతకాలంబు డగ్గఱినన్ బెగ్గడిలక దేహి దేహ పుత్రకళత్రాది సందోహంబు వలని మోహసాలంబు నిష్కామ కరవాలంబున నిర్మూలంబు

---

1. శ్రీమదాంధ్ర భాగవతం - ప్రథమస్కంధం -198 వ వచనం.
2. శ్రీమదాంధ్ర భాగవతం - ప్రథమస్కంధం - 325వ వచనం.

సేసి గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు .... .... .... .... .... .... .... .... .... నిర్మల చిత్తంబునం బరమంబైన విష్ణుపదంబునకుం జనుధారణానియమంబు గలుగ సుఖాత్మకంబగు విషయంబు నవలోకించు యోగికి భక్తి లక్షణంబైన యోగాశ్రయంబున వేగంబ మోక్షంబు సిద్ధించు .... .... ..."[1]

స్తుతి వచనం—

"మఱియు సజ్జనదురిత సంహారకుండును, దుర్జననివారకుండును, సర్వ రూపకుండును, బరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయకమల కర్ణికా మధ్యప్రదీపకుండును, సాత్వతశ్రేష్ఠుడును, నిఖిల కల్యాణగుణగరిష్ఠుండును, బరమ భక్తియుక్త సులభుండును, భక్తిహీనజన దుర్లభుండును, నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును, నిజస్వరూప బ్రహ్మవిహారుండునూనైన యప్పరమేశ్వరునకు నమస్కరించెద."[2]

భగవంతుని స్తుతి ఇందులోని వస్తువు. భగవంతుడు ఎవరికి సులభంగా దర్శనం ఇస్తాడో వివరించాడు. ఇందులో బ్రహ్మ అధిపతి. ఇది శాంతరసం ద్యోతకమయ్యే చూర్ణికాప్రాయ వచనం.

ఈశ్వరకృతమైన ఐహికమైన జీవక్రియానుష్ఠానం, నిర్గుణుడైన ఈశ్వరుని నుండి ఉద్భవమైన అరిషడ్వర్గాలు కార్యకరణ కర్తృత్వాలను పొంది, జీవుని ఏ విధమైన మార్గాన్ని పొందింపజేస్తాయో ఇట్టి పరమేశ్వర మాయలు, ఆ మహాదేవుని యొక్క లీలలు వర్ణితమైన వచనాలు భాగవతంలో కోకొల్లలు. ఇటువంటివన్నీ చూర్ణికప్రాయాలే.

"మఱియు దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును . . . . . . . . . . . . . . . . . ఇవ్విధంబునం గ్రీడించుచుండు."[3]

---

1. భాగవతం - ద్వితీయ స్కంధం - 12వ వచనం.
2. భాగవతం - ద్వితీయస్కంధం - 59 వ వచనం.
3. భాగవతం - ద్వితీయస్కంధం - 84 వ వచనం.

"వినుం మాయావిదుండైన యీశ్వరుండు తన మాయంజేసి దైవ
యోగంబునం

.... .... .... అట్టి యండంబు భేదించి నిర్గమించె నెట్లంటేని."1
"చతుర్దశ లోకంబులందు మీది ఏడు లోకంబులు .... .... ....
.... .... ....లోక కల్పనంబు నెన్నుదురు .... .... ....
పురుషోత్తముని ముఖంబు వలన సర్వజంతు వాచాజాలంబుం దదధిష్ఠాత
యగు వహ్నియు నుదయించె.... .... .... .... .... ....
.... .... .... మహామహుని హృదయంబు సర్గభూమి యగు—"2

పై రెండు వచనాలలో మహాదేవుని నుండి సమస్త లోకాలు, కావ్య, రస, భాషాదులు ఏ విధంగా ఉద్భవించాయో వర్ణించాడు

ఇటువంటి వచనమే మరొకటి:

"అని వెండియు నిట్లను ననమా! యమ్మహనీయ తేజోనిధి
మొదలి యవతారంబు .... .... .... నాకుందోచినంత
నీ కెరింగించెద వినుము."3

"నిజవాసంబు నాశ్రయించి జీవుండు స్పర్శేంద్రియ గతుండై
పృథగ్భావంబయ్యె .... .... .... ముఖంబు వలన
నామ్నాయంబు లుత్పన్నంబులయ్యె .... .... ...."4

---

1. శ్రీమదాంధ్ర మహా భాగవతం - ద్వితీయస్కంధం - 86 వ వచనం.
2 ,, ,, ,, - 89 వ వచనం.
3. ,, ,, ,, - 112 వ వచనం.
4. ,, ,, - తృతీయస్కంధం - 215 వ వచనం.

"మఱియు నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోక సంగ్ర హంబును నతివిస్తార వర్తులాయామంబునునై .... .... .... .... దివ్య రూపంబునుం గలిగి"[1]

"మఱియు జ్ఞానానంద పరిపూర్ణ మాత్రంబును ననావృత ప్రకాశంబును భేద రహితంబును .... .... .... .... ....భవదీయ భక్తియోగ పరి శోధితంబైన హృత్సరోజ కర్ణికా పీఠంబున"[2]

"దేవా ! సర్వ భూతాంత ర్యామివై భగవంతుడ వైన నీకు నమస్క రించి .... .... .... .... .... .... .... ....నన్నుం గరుణార్ద్ర, దృష్టి విలోకించి దయ సేయుమని విన్నవించిన, నాలించి పుండరీకాక్షుండతని కిట్లనియె"[3]

ఇలాంటి స్తుతివచనాలు కృష్ణమాచార్యుని వచనాలవలె ఉంటాయి. ఇటు వంటి ఆధ్యాత్మికమైన విషయం వస్తువుగా గల దీర్ఘవచనాలు చూర్ణికాప్రాయాలే.

"మఱియు నుత్పత్తి స్థితిలయంబు లెందగుచు బ్రకాశింప బడునది యాశ్రయంబనంబడు నదియ పరమాత్మ బ్రహ్మ శబ్ద వాచ్యంబు ..... .... త్రివిధంబుగా సృజియించె"[4]

"మఱియు వాగింద్రియంబు పుట్టె; దానికి దేవత యగ్ని .... .... ... .... .... .... .... .... .... వివిధంబగునిది యంతయు పర్వేశ్వరుని స్థూల విగ్రహంబునం బుట్టు.... .. . ....

---

1. శ్రీమదాంధ్ర భాగవతం - తృతీయస్కంధం - 288 వ వచనం
2. ,, ,, 297 వ వచనం
3. ,, - ద్వితీయస్కంధం - 249 వ వచనం
4. ,, - ద్వితీయస్కంధం - 268 వ వచనం
5. ,, - ద్వితీయస్కంధం - 270 వ వచనం

స్తుతి వచనాలు (విన్నపం) చూర్ణిక—

"దేవా! నీవఖండిత విజ్ఞాన రూపాంతః కరణుండ వయ్యును ముగ్ధ భావంబున, బ్రమత్తుని చందంబున, విమోహి కైవడిం బ్రవర్తించుచు నెందేని నొదిగి యుండుటం దలంచి నా డెందంబు గుందుచుండు. అరవిందలోచన! సురవందిత! ముకుంద! ఇందిరా సుందరీ రమణ! సరస్వతీ రమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేని, గృపసేయుము. భవదీయ శాసనంబు ధరియించి భూరి సంసార పారావారోత్తరణంబు సేయుదునని విన్నవించి బహు భంగులం బ్రస్తుతించిన భగవంతుడును బ్రపన్న పారిజాతంబునునైన కృష్ణుండు పరతత్వ నిర్ణయంబు నెఱింగించిన"[1]

"కశ్యపుం గనుగొని యిట్లనియె; సమస్త భూతపతియైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భ పరిపాలనంబు సేయుంగాక! రుద్రుండును, మహాత్ముండును స్వయం ప్రకాశుండును సకామ జనఫల ప్రావకుండును నిష్కామజన మోక్షప్రదుండును న్యస్త దండుండును ధృత దండుండును .... ... .... .... .... .... .... ..
సతీదేవి పతియునైన యా సర్వేశ్వరుండు రన్ను రక్షించుంగాతయని సన్నుతించె."[2]

కవికర్ణ రసాయనంలో—

మాంధాత వసిష్ఠునితో ఉపాస్యబ్రహ్మ స్వరూపాన్ని వివరిస్తూ ఈ విధంగా అంటాడు:

కర్మం ఒక్కటే అయినా చాలా ఫల విభాగాలు ఉన్నాయి.

"అట్లగుట నంతరాత్మ నెఱుంగని యప్పుడు తత్తదేవతారాధన రూపంబులైన వివిధంబులగు కర్మంబులంతరాత్మ యొక్కండ భగవంతుండని యెఱింగి తదారాధన రూపంబులుగా నొనరింప నభిమతైక ఫల బీజంబులుగా నేర్చు.

---

1. శ్రీమదాంధ్ర మహాభాగవతం - తృతీయస్కంధం - 156 వ వచనం.
2. శ్రీమదాంధ్ర మహాభాగవతం - తృతీయస్కంధం - 473 వ వచనం.

అభిమత వివిధ ఫలప్రదాయక భగవదారాధన రూపంబగుటనే కర్మంబును వివిధ ఫలంబులకు బీజంబునుంగా నేర్చు. కావున నవశ్యంబును మొదల నారాధనీయుండగు భగవంతు నెఱుంగవలయు కేవల దేహాత్మాభిమాన మూలంబులగు భగవద్విషయ రాగద్వేషాదులు కర్మ హరంబులుగా నేర్చు గాని దత్త్వజ్ఞతాభిమానంబున భగవంతు నన్యథా రూపంబున నొండె విపరీత రూపంబున నొండె నెఱింగెనేని తన్మూలతద్విషయ ద్వేషంబధోగతి కారణం బగుట గణింపనేల తన్మూలరాగ కార్యంబులగు తదారాధనస్మరణ కీర్తనాదులు విఫలంబులగు.... .... .... .... .... .... ....”1

అని ఇంకా భగవత్స్వరూపం, భగవదారాధన ఏ రూపంలో ఉన్నా అది అనేక ఫలాలకు బీజభూతం అవుతుంది; సమస్త కర్మానువర్తికి భగవంతుడే మూలం, అటువంటి భగవంతుని స్వరూపం తెలుసుకోమని ఇందలి సారం. దీనికి కర్త భగవంతుడే. ఈ వచనంలో వేదాంతపరమైన విషయం వస్తువుగా స్పష్టమవుతోంది. ఇందులో రసం శాంతరసం, ఇది చూర్ణికావచనంగా చెప్ప వచ్చు. ఇటువంటిదే మరొక వచనం:

ప్రళయ సమయంబునం ప్రలీనజ్ఞానులగుచు, సుషుప్త
సమయంబున కంటె నచిత్ప్రాయులై ప్రకృతినిర్మగ్నులై
యుండు నిఖిల జీవుల వయిం గరుణించి .... ....
.... .... ..... .... .... ..... .... ....
.... .... ..... .... .... .... .... ....
ఇవ్విధంబున నఖిల భూత హిత పరత్వంబున సలీలా
ప్రవృత్తుండగుటం జేసి విచిత్ర ఫలభోక్తలగు జీవులం
గూర్చి వైషమ్య నైర్ఘృణ్యంబు లీశ్వరునకుం దొరల
నేరవు.... .... .... .... .... .... ....2

ఇట్టి సుదీర్ఘమైన వచనాలు కవికర్ణరసాయనంలో ఎక్కువగా కానవస్తాయి.

1. కవికర్ణ రసాయనము - పంచమాశ్వాసము - 41 వ వచనం.
2. కవికర్ణ రసాయనము - పంచమాశ్వాసము - 61 వ వచనం.

"వేదాంత పురాణ స్వరూప నిరూపణంలో"

ఈ యర్థంబు వేదనిశ్చితం బెట్లన .... .... ఇట్టి గుణత్రయ మూల ప్రతిపాదక వైషమ్యంబునుం దత్తదధికార విశ్వాసజనకంబులై తత్తదభిమిత ఫలప్రదంబులగుట భగవత్సం కల్పకల్పితంబని యెఱుంగునది"[1]

భక్తి స్వరూపాన్ని నిరూపిస్తూ

వినుము శాస్త్రార్థతత్త్వజ్ఞానంబుచే గర్మ యోగాధికారంబు సంభవించు .... .... .... .... .... .... .... .... .... .... .... .... తదవస్థా విశేషముఖ్యంబున ముక్తుండై పరమపద ప్రాప్తుంతగు నట్లు గావున"[2]

సంసార రూప నిరూపణంలో-

"వస్తు వివేకంబులేక విషయ విరక్తియు భగవద్భక్తియు
బొడమవు.... .... .... .... క్రమ్మలా జీవత్వంబునం
జన్మించు ఇట్టి సంసారా వర్తగర్తంబునం బరిభ్రమించుచు"[3]
"వెండియు జరా ప్రాదుర్భావంబున్ శిథిలంబై కుదురుపట్టెడలి
లివలివం గదలు రదన పంక్తులును .... .... ....
.... .... .... .... .... అత్యంత దుస్సహంబైన
మరణంబనుభవించు .... .... .... .... ...."[4]

మోక్షావతరణంలో-

"సంసార చక్రంబు కర్మ మూలంబగుటయు తత్కర్మంబు
దురంతంబగుటయు తప్పదు.... .... .... .... ....
. . . . . . . . . . . . . అతని నుద్ధరింప సన్నద్ధుండయి
విశేష ప్రయత్నంబునకు బొచ్చు . . . . . . . . . . "[5]

---

1. కవికర్ణ రసాయనము - పంచమాశ్వాసము - 76 వ వచనం.
2. " " - 95 వ వచనం.
3. " " - 100 వ వచనం.
4. " " - 110 వ వచనం.
5. " " - 141 వ వచనం.

పంచమాశ్వాసంలో కర్మ స్వరూపాన్ని వివరిస్తూ భగవంతుడే ఫలాత్మకం. మానవులు చేసిన కర్మానుగతంగా ఫలాన్ని అనుభవిస్తారు. తత్కర్మానుసారంగా బహు జన్మలను పొంది ఫలాన్ని అనుభవిస్తారు. సమస్తము ఈశ్వరగతం. ఈశ్వరేచ్ఛానువర్తులై మనుషులు చరించవలెను. అట్టి ఈశ్వరాత్మకమైన ఈ ప్రపంచంలో సృష్టిలో మానవుని పుట్టుకనుండి గిట్టుటదాకా అన్ని విషయాలు వివరించాడు కవి. అన్నీ వేదాంతపరమైన వచనాలే. ఇట్టి వచనాలు సింహగిరి నరహరి వచనాలతో దీటైనవి. చూర్ణికలుగా పేర్కొనదగినవి.

అధ్యాత్మ రామాయణ కీర్తనల్లో-

జటాయువుచే చేయబడిన శ్రీరామ స్తుతి చూర్ణంబుగా శ్రీ మునిపల్లి సుబ్రహ్మణ్య కవి పేర్కొన్నారు.

"శ్రీమదగణిత గుణమణి గుణాలంకృత రుచిర చిరతర శుభ స్వరూపం, సకల జనభయావహ మహదజ్ఞాన జనిత కలి కలుషాంధతామిస్ర నవారక భవతారక దీపం, అనుపమాద్భుత మహత్ప్రతాపం, హతదీన జనతా మనస్తాపం, కరధృత విదితామోఘ శరచాపం, జగదుదయ స్థితి సంహారావిర్భావతి రోధానాది మహా మాయా వినోద నిదానం,.................. ..........

.............................................. ....... ...............................................

యాచిత వైరోచనం కుముద బాంధవ కిరీట ప్రచండ కోదండ ఖండనోద్దండ దోర్దండ సముద్దామం, దేవతా సార్వభౌమం, రవికుల పయః పారావార పరిపూర్ణ సోమం, గర్విత పూర్వ గిర్వాణ వాహినీ సందోహ కఠిన కంఠలుంఠన గళచ్ఛోణి తారుణిత సహస్రకర సహస్రకోటి ప్రభాభాసమాన మహాభూత భయంకర సుదర్శనాభిధానావక్ర చక్రాయుధాభిరామం, మారీచ సుబాహు విరామం.

.... .... .... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... ....

తోషితాశేష భూపాల సురాసుర యక్షరక్షోరగ గరుడ గంధర్వ సిద్ధ సాధ్య

కిన్నర కింపురుష విద్యాధర చారణాప్సరోబృందరత బహువందనం భక్తజన చందనం, రఘునందనం, త్వాంభజామి త్వాంభజామి॥"1

ఈ విధంగా సాగిన ఈ చూర్ణికలో శ్రీరాముని మహిమ వర్ణితమైంది. ఇందులోని నాయకుడు భగవంతుడైన శ్రీరాముడు. ఇతని గుణకీర్తనం ఇందులోని వస్తువు.

వాగ్గేయకారుడైన శ్రీ మునిపల్లి సుబ్రహ్మణ్యకవి రాసిన అధ్యాత్మ రామాయణ కీర్తనలు అన్నిటికీ రాగ తాళ నిర్దేశం ఉంది. ఈ శ్రీరామస్తుతికి మాత్రం రాగ తాళ నిర్దేశం చేయలేదు. చూర్ణికగా మాత్రం చెప్పాడు. గుణస్తుతి వస్తువుగా ఉన్న ఈ చూర్ణిక వాగ్గేయకారుని కృతం అయినప్పటికీ సంగీత గద్య ప్రబంధ భేదం చూర్ణిక కిచ్చిన లక్షణాలకు పూర్తి లక్ష్యం అని చెప్పడానికి వీలుగా లేదు. ఎందువల్లనంటే ఇది ప్రబంధ ధాతు, అంగాలు సంపూర్ణంగా ఉన్న ప్రబంధం కాదు. ఇది ఆలయాల్లో ఆలపించే స్తుతిపరమైనది మాత్రమే. ఇందులో రచనారీతి వైదర్భీరీతి. సాత్వతీ వృత్తి కలిగి ఉదాహరణగా పేర్కొన దానికి వీలుగా ఉంది.

వృత్తగంధి : శాంతరసం, పీతవర్ణం, ముని దైవతం, పాంచాలీ రీతి, భారతీ వృత్తి, పద్యభాగ మిశ్రితం.

లక్షణకారులు చెప్పిన-

"దీనికీ ఉత్కళికకూ భేదమేమిటంటే రెండూ దీర్ఘసమాస బహుళాలే అయినా వృత్తగంధిలో వృత్తభాగం ఉంటుంది. అత్యంత తీవ్రపదజాలంతో దీర్ఘసామాసాదితం, కొంత మృదు పదబంధం, మరికొంత ఉంటే పాంచాలీ రీతి అవుతుంది.

"ఈషత్ప్రౌఢార్థ సందర్భా భారతీ వృత్తి రిష్యతే"2

---

1. శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు— అరణ్యకాండం—చూర్ణిక శ్రీరామ స్తవం.
2. కావ్యాలంకార సంగ్రహం - ద్వితీయశ్వాసం.

ఈ లక్షణాలన్నీ ఉన్న సంస్కృత గద్య శ్రీ వెంకటేశ్వర గద్య. ఈ గద్య ఆలపించే తీరులో శైలి మారినపుడు భాషా, వృత్తుల తీరు కూడా మారుతుంది.

"శ్రీమదఖిల మహీమండల మండన ధరణీధర మండలా ఖండలస్య .... .... .... .... .... .... .... .... .... ....మహాతటాక మండితస్య."

ఇంతవరకూ ఆలపించే తీరు ఒకే విధంగా ఉంటుంది. భాష సులభ శైలి కలిగి పాంచాలీ రీతిలో గతి నడిచింది.

"కలికర్దమ మలిమర్దన కలితోద్యమ విలసద్యమ నియమాదిమ ముని గణ నిషేవ్యమా .... .... .... .... .... .... స్వామి పుష్కరిణి సమేతస్య."

ఇంతవరకూ భాష ఈషత్ మృదుపద బంధురమై సులభశైలి కలిగి ఉంది.

"బహు సంకట నరకావట పతదుత్కట కలికంకట కలుషోద్భట.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... సుప్రసన్నో విజయతామ్."

ఈ భాగంలో గతిమారి సుదీర్ఘ సమాసాలతో కఠిన పదజాలంతో నడిచింది ఈ గద్యం. వైదర్భీరీతిలోని రచన అని చెప్పినా, ఆరభటీ వృత్తిని కలిగి ఉంది.

"నాటారభి భూపాళ బిల్హరి మాయామాళవగౌళ అసావేరీ సావేరీ శుద్ధ సావేరీ .... .... .... .... .... .... .... .... భవంతోఽను గృహ్ణంతు"1. చివరి వరకూ ఒక గతిలోనూ మృదు పద బంధురతతో కూడి ఈ వేంకటేశ్వర గద్య వృత్తగంధికి లక్ష్యప్రాయం అయ్యిందని చెప్పేందుకు వీలుగా ఉంది.

1. వేంకటేశ్వర గద్య.

**లలితగద్య :** ఇది శృంగార రసప్రధానమైంది. దీనిని దేవాలయాలలో ఆలపించే గద్యగా చెప్తారు. కానీ నృత్య నాటికలలో అభినయార్థం ఉపయో గించే రతీ విలాపాది ఘట్టాలూ, తపస్సు చేయడానికి వెళ్ళే పార్వతీ వర్ణనాదులు, లేఖలు మొదలైన వాటిని లలిత గద్యలుగా పరిగణించవచ్చు. లలిత గద్యలోని లక్షణం భక్తుని పిలుపు, శృంగార నాయికానాయకులకు సంబంధించిన వర్ణనా, చిత్ర దర్శనం కలుగ జేసే వర్ణనలు కలదిగా కూడా చెప్పవచ్చు.

హరవిలాసం తృతీయాశ్వాసంలో-

భస్మీపటలం అయిన మదనుని చూచిన రతీదేవి విలాపాన్ని ఈ విధంగా వర్ణించారు:

"మన్మథ! మధురాలాప నిసర్గపండితంబులగు గండుంగోయిల నేలాకో భువనంబులకు రాయబారంబు పంపవు? ప్రణిపాతయాచితంబులగు గాఢోప గూహనంబులు మరచితే? యార్తవంబగు కుసుమ ప్రధానంబు, నాయంగంబు లందిది నీవు రచియించినదికదా! దక్షిణేతరంబగు మదీయ చరణంబు లాక్షా రాగ పరికర్మంబునకుం దగదొకో?" యని యనేక ప్రకారంబులం బలవింప దత్పరిదేవనాక్షరంబులు బాణ పాతంబులంబోలి దూఱనాటుటయు యెంతయు నొచ్చియు మ్మధుమాసం బక్కసలయ కోమలికిం బుట్టిన మహావ్యసనంబూరార్ప జేఱ వచ్చుటయు[1] ..... ..... ..... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... ....

ఇవ్విధంబున నారామ పేరామని యెదట నెమ్మనంబుల బేరామని యై వర్తిల్లు నార్తి సంబెరంబిచ్చి సొమ్మసిలంబోయి లేచి వసంతునిం గనుంగొని మాధవ! నీ చెలికానింజూడు కపోతకర్బురంబైన భస్మంబైనవాడు.... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... ....

అని పల్కి శోకావేశంబున.... .... .... .... ....

మదనుని చూచి విషణ్ణవదనయై రతీదేవి విలపించిన విధం గానయోగ్య మైంది. ఇటువంటి గద్యలు నృత్య ప్రదర్శనకు తగినవి.

---

1. హరవిలాసం - తృతీయాశ్వాసం - 91, 93 వచనాలు.

వీరభద్ర విజయంలో పోతన-

ఆమె స్థితిని వర్ణించిన తీరు అభినయ పాత్రం, లలిత గద్యప్రాయం.

"మఱియు నయ్యవసరంబున ఫాలలోచనాభీల పావక కరాళ జ్వాలావళీ పాత భస్మీభూతుండై చేతో జాతుండు దిగుట గనుంగొని విస్మయాకుల చిత్తయై యతని సతియైన రతీదేవి ఝల్లని యుల్లంబు పల్లటిల్ల నోలంబోయి మూర్ఛిల్లి యల్లన తెలివొంది శోకంపు వెల్లి మునింగి కలంగుచు దొలంగరాని బలువ గల పాలై తూలుచు వదనంబును శిరంబును వదన గహ్వరంబు నందంద మోదు కొనుచు మదనుండు ఒలసిన చోటికి డాయంబోయి[1] .... ....

.... .... .... .... ..... ..... .... ..... .... .... ....

ఇలాగే వాగ్గేయకారుడూ సాహిత్యకారుడూ అని ప్రసిద్ధికెక్కిన నారాయణ తీర్థులవారి కృష్ణలీలా తరంగిణిలో శ్రీకృష్ణునకు రుక్మిణీదేవి రాసిన లేఖ కూడా లలితగద్యలో చేర్చవచ్చు.

ఈ వచనం పూర్తిగా సంస్కృతంలో ఉంది.

## రుక్మిణ్యాః పత్రికా లేఖ ప్రకారం :

తథాహి శ్రీమతే సత్యకామ సత్య సంకల్ప సర్వకామ సర్వరస సర్వ గంధ సర్వ సంకల్పాది గుణవతే కృతా కృత మాతృమానమే భేద భిన్న సకల జగదాధారావ భాసకాయ నిష్ప్రత్యూహ నిరతిశయా నందావ ధీరిత బ్రహ్మ లోకానన్దాయ విశ్వవైశ్వానరాది సకల నామ రూప నిర్వాహకాయ సర్వత్ర శక్తి సమన్వితాయ సర్వాంతర్యామినే దుష్ట నిగ్రహ శిష్ట ప్రతిపాల కాయ భక్తాను కంపయా వరిగృహీత గోపకుమార భావాయ కరచరణ నళిన విలసిత ధ్వజ వజ్రాంకుశాది రేఖాయ మహా పురుష లక్షణాయ కనక మణి మయ మకరకుండల కటక కటి సూత్రాంగదాది దివ్యభూషణ భూషితాయ భక్తజన కామిత కామవర్షి మహామేఘ నీలమేఘ సముజ్వల విద్యుత్పుంజ కల్ప దివ్య పీతాంబర ధారిణే శ్రీవత్స కౌస్తుభాది శోభితాయ దీనదయా పరమూర్తయో శ్రీకృష్ణాయ! శతకృత్వ స్సహస్ర కృత్వశ్చ నమోనమః.

---

1. వీరభద్ర విజయం - ద్వితీయాశ్వాసము - 112 వ వచనం.

రుక్మిణీ లేఖలో-

వచనంలో కేవలం శ్రీకృష్ణుని వర్ణించి తరువాత శ్లోకాల్లో లేఖను పూర్తి చేస్తాడు కవి,

"గౌరీ శంకర పూజార్థ యాత్రమ్
నగరాద్బహిః
యదా తదాహ్యాసరో భవతో
మత్పరిగ్రహే
ఇతి విప్రముఖాచ్ఛ్రుత్వా రుక్మిణ్యా
లిఖితం హరిః
ప్రత్యుత్తరం, లిఖిత్వాఽథతత్ర
గంతుం మనోదధే॥[1]

గద్యంలో శ్రీకృష్ణుని స్తుతి మాత్రమే ఉంటుంది. ఒక్కొక్క సందర్భంలో కథాభాగాలు కేవల వచనాల్లో పూర్తి కాకుండా తరువాత శ్లోకాల్లో కథాభాగాన్ని ఇనుమడింప జేస్తారు. రుక్మిణి బ్రాహ్మణునిచే పంపిన లేఖలో శ్రీకృష్ణుని స్తుతి గద్యలో చేసి తనకు మరెవరు దిక్కులేరు. గౌరీదేవి ఆలయానికి వచ్చినప్పుడు నన్ను చేకొనుము. అనే ఈ భావాన్ని శ్లోకాల్లో చెప్పింది. కథా సందర్భం దీనితో పూర్తయినందువల్ల శ్లోకాలను కూడా చేర్చవలసివచ్చింది. ఈ గద్య కూడా శృంగార రసాత్మకం. ఇది కూడా అభినయానికి అనుకూలమైన వచనం. ఇందులో శ్రీకృష్ణుని గుణవర్ణన వస్తువు.

కూచిపూడి భామాకలాపంలోని సత్యభామా లిఖితమైన లేఖ లలితగద్యగా పేర్కొనవచ్చు.

ఇప్పటికీ నాట్యంలో ఈ లేఖనే ప్రదర్శనకు గ్రహిస్తున్నారు. ఈ లేఖ సత్యభామ తన శ్రీవారిని ఆహ్వానిస్తూ చేసిన విన్నపం వస్తువుగా గలది. తెలుగులోని వచన రచన ఇది.

---

1. శ్రీకృష్ణలీలా తరంగిణి - ద్వాదశతరంగం

"శ్రీమద్రత్నాకర పుత్రిక ముఖారవింద మరందపాన వినిసిత మిళిం దాయమాన నంద నందన ముచుకుంద వరద మందరోద్ధర పరిహసిత రాకా సుధాకర సుందర వదనార విందుండగు శ్రీరాజ గోపాలస్వామి వారి చరణార విందంబులకు.

సత్యభామ నిటల తట పదఘటిత కరకమలయై యనేక సాష్టాంగ దండంబు లాచరించి చాయంగల విజ్ఞాపనము.

మజ్జనకుండగు సత్రాజిత్తు నన్ను మీకిచ్చి వివాహం బొనరించిన ప్రభృతి .... .... .... .... .... ..... ..... ..... .... .... ....

నావంటి యబల యెడ చలము బూనుట ధర్మంబు గాదు. కావున నన్ను కరుణించి యిటకు విచ్చేసి మకర కేతన కేళిందనివి సంతసంబొనరింప ప్రార్థింతును. .... .... .... .... .... .... .... .... ........

చిత్తగించవలెను
ఇట్లు
ప్రాణసఖి సత్యభామ[1]

ఇలా లిఖించిన లేఖలో వివాహం చేసుకున్న తరువాత కొంతకాలం తన దగ్గరుండి వెళ్ళి రుక్మిణియందు లగ్నమనస్కుడై ఉండడం భరించలేక ప్రాణసఖి అయిన తనమీద కఠిన మనస్కుడైనాడనీ, కృష్ణుడు సత్యభామా విధేయుడనీ భావించింది. ప్రకృతి అంతా తనపై కఠినంగా ప్రవర్తిస్తోందనీ కాబట్టి వెంటనే వచ్చి ఆదుకొమ్మనీ సత్యభామ ఉత్తరంలోని సారాంశం. ఇది అభినయ యోగ్యమైన సమస్త లక్షణోపేతమైన లలిత గద్య.

భామా కలాపంలోని ప్రత్యేకత ఏమిటంటే స్తుతి రూపంలో కొంత వచనం ఉండి కొంత విన్నపంగా ఉంటుంది. శృంగార రసయుతం. శ్రీకృష్ణుడు అధిపతి. గాన యోగ్యమైంది. అభినయ ప్రధానం. ఇందులో భావ ప్రకటనకూ రాగరంజనకూ సాత్వికాభినయం చేయదగినదీ వచన రూప లేఖ.

1. కూచిపూడి భామాకలాపం - సత్యభామ లేఖ.

**ఖండగతిగద్య :-** గణేశదైవతాకం, సాత్త్వతీ వృత్తి, వైదర్భీరీతీ, ఆరంభంలో హాస్య సూచన ఉండాలి. ఇవి సంగీత పరమైన లక్షణాలు.

అల్పసమాసకం లేదా మృదుపదయుతం అయిన రీతి వైదర్భీరీతి, కొంచెం ప్రౌఢమైన అర్థాన్నిచ్చే సందర్భంలో సాత్త్వతీవృత్తి ఇవి సాహిత్య పరంగా లక్షణాలు.[1]

ఖండగతి గద్యకు లక్ష్యాలుగా సాహిత్యంలోని దండకాలను పేర్కొన వచ్చు.

ముందు పేర్కొన్న శ్యామలా దండకం, సూర్య దండకాది దండకా లన్నీ ఖండ గద్య ప్రబంధానికి ఉదాహరణ ప్రాయాలే!

సాధారణంగా దండకాలలో స్త్రీ పురుష దేవతామూర్తులను స్తుతించడం వస్తువుగా ఉంటుంది. కొంత విన్నపంగా కూడా ఉంటుంది. సంగీత పరంగా సాహిత్యపరంగా ఇచ్చిన లక్షణాలను యథాతథంగా ఏ మాత్రం అన్వయించ డానికి వీలులేని విధంగా దండక రచన సాగుతుంది. శార్ఙ్గదేవుని కాలంనాటికి గద్య ప్రబంధ రచన ఉండేదని చెప్పడం వల్ల ఆ గద్య ప్రబంధ లక్షణాలకు లక్ష్యాలు అప్పుడు ఉన్నా ఇప్పుడు మృగ్యం. అయినా ఉదాహరణ ప్రాయా లుగా దండకాలను గ్రహించాలి.

కొన్ని దండకాలు ఛందస్సులోగానీ, రచనారీతిలోగానీ, భాషా విష యంలోగానీ, స్వేచ్ఛతో బాటు వైవిధ్యాన్ని కలిగి ఉంటాయి.

హరవిలాసంలో—

జయ జయ శివలింగ జ్యోతిర్మహాలింగ లింగోద్భవ శ్రీ మహాలింగ వేదత్రయీలింగ నిర్లింగ సంస్పర్శలింగ క్షమాలింగ సద్భావలింగ స్వభావైక లింగ... ... ... ... ... దిగ్దేశ కాల వ్యవచ్ఛేద రాహిత్యలింగ స్వయంభూ మహాలింగ పాతాళలింగ క్రియాలింగ పంచాక్షరీ లింగ పంచప్రకారో పదీప

1. కావ్యాలంకార సంగ్రహం - ద్వితీయాశ్వాసం.

క్రియాలింగ వారాణసీక్షేత్ర సింధూ? గయా రుద్రపాద ద్వయీ శ్రీగిరి స్థాన శోణాచల వ్యాఘ్ర పుర్యాది నానావిధ స్థాన సంసిద్ధిలింగ ప్రమాణా ప్రమేయ ప్రథాలింగ విద్యా కళాలింగ ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... సారంగ లింగాత్మ భూలింగ ఐంలింగ ఈంలింగ ఓంలింగ దివ్యాత్మ నానా విరూపాక్ష లింగా నమస్తే నమస్తే నమః[1]

ఇందులో దీర్ఘసమాసాలు లేవు. ఇది పూర్తి సంస్కృత పదాలతో కూడిన దండకం. ఇందులో అధిపతి ఈశ్వరుడు. లింగంగా ఆవిర్భవించిన ఈశ్వరుని స్తుతించడం ఇందులోని వస్తువు. సాత్వతీ వృత్తిలో సాగింది ఈ దండకం.

హరవిలాసంలోనే—

జయజయ జగదేక రక్షామణీ! దేవ చూడామణి శ్రేణి శోణ ప్రభాజాల సుస్మేరపాదారవిందా! ముకుందప్రియా! యిందుధారీ! కటస్యంది దానాంబుధా రాధునీ ధోరణీ గాహకౌతూహలాయత్త మత్త ద్విరేఫాంగనా గాన సంగీత రంగీ కృతస్వాంత! దంతావళాస్యా! .... .... .... ....
.... .... .... .... .... .... .... .... .... ....

విఘ్నరాజా! గణాధ్యక్ష! కారుణ్య లీలాకటాక్షంబునన్ మమ్ము వీక్షించి రక్షింపుమీ. క్షీరవారాశి నీ మందరక్ష్మాధరస్వామి కవ్వంబుగా నీ భుజంగాధినాథుండు సూత్రంబుగాఁ గచ్ఛపాధీశుఁ డాధార పీఠంబుగా సర్వ దివ్యౌషధీ వల్లుల న్వైచి నానా పదార్థంబు లన్యోన్యలంబంచుకోఁ గోరియున్నార మిక్కార్యమే విఘ్నముం బొందకుండంగ నే విక్రయం జెంద కిష్టార్థ సంసిద్ధులం గై కొనుంగాక నీ యాజ్ఞ! సర్వేశ! సర్వాత్మకా! నిర్వికల్పా! నిరీహా! నిరాతంక! నిశ్శంక! యోంకార మూర్తీ! నమస్తే! నమస్తే! నమః.[2]

క్షీరసంద్ర మథనం చేయబోయే ముందు విఘ్నేశ్వరునికి విధిగా పూజ చేసి దేవాసురులు స్తుతించుట ఇందులోని వస్తువు.

ఈ దండకంలో వినాయకుడు అధిపతి. వినాయకుని స్తుతిస్తూ రక్షింపుమని అర్థించడం వస్తువు. తత్సమపద భూయిష్టమైన రచనగా ఈ దండకం

1. హరవిలాసం - పంచమాశ్వాసాంత్య భాగం.
2. హరవిలాసం - షష్ఠాశ్వాసం - 58 వ - దండకం,

ఉంది. శాంతమే ఇందులోని రసం. సాత్వతీ వృత్తిలో, వైదర్భీ రీతిలో ఈ దండక రచన చేశాడు శ్రీనాథుడు.

**ఖండగతిగద్య :**

కళాపూర్ణోదయంలో—

దండకం—

శ్రీకామినీ కామితాకార! సాకార కారుణ్యధారా నవాంకూర శంకా కరా శోణ రేఖా మయూఖాళి కిమ్మీరి తాలోకనాలోక, లోకైక సంస్తుత్య నిత్య ప్రభావ, విభావై భవాధిక్యధిక్కారితానంత మార్తాండ కోటీర, యాటీక మానా మలా స్తంభ శుంభద్యశఃపూర కర్పూర సౌరభ్య మైత్రీ పవిత్రీకృతామ్నాయ, వాయు ప్రచారా, విశాపాదితాపార సంసార సంతాప నిర్వాపణా, పాపనిర్వా పణోపాయ నామ ప్రశంసానుభావా భవాభావలోభా కులీభూత చేతస్సుధీ వ్రాత నిర్ణీత సంప్రాప్తసద్భక్తి మార్గైక విశ్రామభూమీ భవత త్త్వరూపా .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... .....

సువిఖ్యాతమైనట్టి నీ దివ్య చారిత్రచారు ప్రచారంబు పారంబు ముట్ట, న్నుతిం పంగ లేరంచు నెంచంగ, వించుం బ్రపంచ స్వభావంబు భావంబున న్మాన కిల్లేము నీ ముందటం జాటువా చాటతల్పాపు చున్నార .... .... ....

.... .... .... .... ... .... .... .... ..... ..... ....

మముంగేవలంబైన కారుణ్య దృష్టింగటాక్షించి రక్షించు, లక్ష్మి మనోవల్లభా! దేవదేవా! నమస్తే నమస్తే నమస్తే నమః.[1]

ఈ దండకంలో మొదట స్తుతి నామాలున్నా తరువాత సూర్యదండకం వలే దీపిస్తుంది.

గణేశదైవతాకంగా చెప్పిన ఖండగతి గద్యలక్షణాలు ఇందులో అంతగా కానరావు. మృదుపదాలతో కూడి, ప్రౌఢమైన అర్థాన్ని ఇచ్చే లక్షణం ఈ దండ కంలో ఉంది. వైదర్భీరీతీ, సాత్త్వతీవృత్తి కలిగి లక్ష్యప్రాయమైంది.

---

1. కళాపూర్ణోదయం - ప్రథమాశ్వాసం - 80 వ వచనం.

ప్రబోధ చంద్రోదయంలో—

జయ జయ వినయా నతేంద్రాది బృందారక శ్రేణీ చూడామణీ రాజీ నీరా జితో పేంత పాదద్వయాంభోజ రాజన్న ఖద్యోత విద్యోతిత స్వర్ణపీఠా నిరా ఘాట మాయారుచి ద్వేషణాద్వైత విభ్రాంతి సంతాన సంతప్త వందారు సంసారని ద్రావహారైక దక్షా దినాధ్యక్ష నక్షత్ర నాథార్క విశ్వ క్షమా మండలోద్ధార వేళా కరాళోరుదంష్ట్రాగ్ర సంఘట్టనా విస్ఫురచ్చైల సంఘాత మాపాటి సంవాహ రోమాంచ వజ్జంఘమును పెను ఘనముల్ బలారాతి పంపంగ నేతెంచి.... ....
.... .... .... .... .... .... .... .... .... నీవిట్టి లీలావతారుండవౌ దింతియేకాక యాకార ముల్నీకు లేవో నిరాకార పాల్కడలి వెడలి యేతెంచి లక్ష్మీచకోరాక్షి నీ కంఠ భాగంబున న్వైచు మాంగల్య దామంబు నెత్తావి కేతెంచు లేదేటి దాటుల్ భవన్నీలదేహచ్ఛవిచ్ఛాదిదచ్ఛాయలై ఝుం క్రియై కామమేయత్వముంబొందు గోవింద యాభక్త సందోహమున్ మోహ సందేహముంబాపి బోధత్వముంజూపి రక్షించు మంచున్ బునర్నమ్రముద్రై"[1]

ఈ దండకం మిగిలిన దండకాల కంటే కొంత భిన్నమైనది. ఇది ఖండ గతిలో నడుస్తుంది. శ్రీ మహా విష్ణువు ఈ దండకంలో అధిపతి. కొంత కఠిన పదసమాసరచనం, తత్సమ పద రచనా ఇందులో కనిపిస్తుంది. వైదర్భీరీతిలో కొంత రచనా గౌడీ రీతిలో కొంత రచనా కనవస్తుంది. సాత్త్వతీ వృత్తి కలది. చివర నమస్తే నమస్తే నమః అని అన్ని దండకాల్లో వలే ఉండదు. "రక్షించు మంచున్ పునర్నమ్రముద్రై" అని పూర్తి అవుతుంది.

రాజశేఖర చరిత్రలో—

జయ జయ! జగదీశ్వరీ! సంతతానశ్వరీ విశ్వదైశ్వర్య సంకల్పనా కల్పవల్లీ! (కృపా ఫుల్ల మల్లీమ తల్లీ!) కృతోల్లాస యోగీశ హృచ్చంచరీకా!
.... .... .... .... .... .... .... .... .... .... ....
సదా సచ్చరిత్రా! భవారాతికిం బ్రీతి కల్పించు నన్నాతియున్ నీవకావే! తమాల ప్రభానీలవై, శోణ మాణిక్య భాస్వత్కటీ చేలవై, నేత్ర పద్మాలవై, యీాకు నిల్లాలవై యున్న యాగట్టురా చూలివిన్నీవ కావే, సుధాహార విశ్రాణ నోదార దర్వీకరావిర్భవద్రోహ? ముద్రాసమున్నిద్ర శోభాకరా! కిన్కచే దాఁకి

1. ప్రబోధచంద్రోదయం - చతుర్థాశ్వాసం - 46 వ దండకం.

యుచ్చండదోర్దండ పాండిత్యముల్ చూపి మొండొడ్డినన్ జండముండామరా రాతులన్ వాతులన్నెత్తురుల్ గ్రక్కవే త్రొక్కి ఖండించి తన్మస్తకముల్ హస్త పద్మంబులం బూనవే. వేనవే ల్దానవుల్లోడురా! బోరులం బోరుతత్సైరి భాకార ఘోరాసురుంబట్టి పెన్దిట్టవై మట్టి లోక ప్రసిద్ధంబుగా వాని మూర్ధంబు నీ పాద పీఠంబుగా నున్నవే, నొంపవే బల్విడిం గట్టి శంభున్నిశుంభుం గరాంభోజ శూలంబునన్, గ్రోలవే రక్త బీజామరద్వేషి క్రొన్నెత్తు రువ్వెత్తుగా, దుర్గనిం ద్రుంచి దుర్గాభిధానంబునుం జెందవే. పొందవే లోకముల్ శాకసంపత్తిమెం బ్రోచి శాకంభరీనామ విఖ్యాతి. నోయమ్మ! యావేదముల్ వాదముల్సేయ నీ వేదముల్గాన కిచ్చోట నీ పాదముల్గంటి, నేమంటి, నా వంటి పుణ్యుండు లే దెచ్చటన్.[1]

ఇదికూడా తత్సమ పద సమాసాలతో కూడిన దండకం. ఇందులో శాంభవి అధి దేవత. కొంత రౌద్రమూర్తిగా వర్ణనతో కూడిన స్తుతి ఇందులో వస్తువు. కొంత ఆరభటీ వృత్తిలో, వైదర్భీరీతిలో దండక రచన సాగింది.

భద్రాచల రామదాసు శ్రీరామచంద్రుని వేడుకుంటూ ఒక దండకం చెప్పాడు. ఇది సుప్రసిద్ధమైన దండకం. ఈ దండకాన్ని ఆకాశవాణిలో శ్రీ మంగలంపల్లి బాలమురళీకృష్ణగారు ఆలపించారు.

"పాహి రామ ప్రభో పాహి రామ ప్రభో
  పాహి భద్రాద్రి వైదేహి రామ ప్రభో!
శ్రీమన్మహా గుణస్తోమాభిరామమీ
  రామ కీర్తనలు వర్ణింతు రామప్రభో!
తమ్ముడును నీవు పార్శ్వమ్ములం జేరి ప
  ల్లమ్ము లెక్కిడి నిల్పుటిమ్ము రామ ప్రభో!
.... .... .... .... .... .... ....
.... .... ... .... .... .... ....
వింటి మీ మహిమ వెన్నంటి తమ్ముడు నీవు
  జంటరారయ్య నా వెంట రామప్రభో!"[2]

1. రాజశేఖర - చరిత్ర - ద్వితీయాశ్వాసము - 89 వ దండకం.
2. భద్రాచల రామదాసు కీర్తనలు.

ఈ విధంగా ఉన్న ఈ దండక రచన ఏ లక్షణాన్నీ అనుసరించని కొత్త రీతిలో ఉంది. ఈ దండకం చరణాలుగా ఉంది, మొదటి పంక్తి 8 రగణాలతో ఉంటుంది. 8 వేరు వేరు గణాలతో ప్రతీ ఆ వృత్తం ఉంటుంది. పాడిన రీతి కూడా మధురంగా ఉంటుంది.

వాగ్గేయకారుడైన రామదాస కృతం అయినందువల్ల కొంత సంగీత గద్య ప్రబంధ గాన రీతిని పొందింది.

## చిత్రగద్య

విష్ణు దైవతాకం, శృంగార రసాత్మకం, చిత్రకైశికీ వృత్తి వైదర్భీరీతి.

నానా భావాల సంయోజనంతో శృంగార హాస్య భావాలతో వైదర్భీ రచనారీతిలో మనకు శ్రీ వేంకటేశ్వర గద్య కనిపిస్తుంది. అక్కడక్కడా నానా రీతులూ వృత్తులూ కూడా ఈ గద్యలో కనిపిస్తాయి. కాబట్టి వేంకటేశ్వర గద్య చిత్రగద్యకు లక్ష్యప్రాయం అవుతుంది. ఇందులో గతి కూడా సందర్భోచితంగా మారుతుంది. శృంగార భావ, భక్తి భావాలతో మిశ్రితమైన భగవత్సంబంధి స్తుతి ఇందులోని వస్తువు. శ్రీమహావిష్ణువు ఇందులో అధిదైవతం.

శ్రీమదఖిల మహీమండల మండన ధరణీధర మండలా ఖండలస్య, నిఖిలసురాసుర వందిత వరాహక్షేత్ర విభూషణస్య .... .... .... .... .... .... .... .... .... .... .... ..... ..... .... ....[1]

శిఖర శేఖర మహాకల్పశాఖ, ఖర్వీభవదతి గర్వీకృత గురుమేర్వీషగిరి ముఖోర్వీధరద కులర్వీకర దయతోర్వీధర శిఖరోర్వీసతత సదూర్వీరుని కర తిమిరః వాణీ పతి శర్వాణీ దయితేంద్రాణీశ్వర ముఖ వాణీయో లస వేణి నిభ శుభవాణీ సుత మహిమాణీయ స్త కోటీర భవదఖిల భువన భవనోదరః.... ....

.... .... .... .... .... .... .... .... .... .... ..

మహాపుణ్య నద్యః సకలతీర్థైస్సహా భకులాంగత నదీ ప్రవాహా ఋగ్యజుస్సామాధర్వణవేద శాస్త్రేతిహాస పురాణ సకల విద్యాఘోష భానుకోటి ప్రకాశ చంద్ర కోటి సమాన నిత్యకళ్యాణ పరంపరోత్తరాభివృద్ధిః భూయాదితి భవంతో మహాంతోఽను గృహ్ణంతు''

కళాపూర్ణోదయంలోని రంభా మాయారంభల సంభాషణ కూడా చిత్ర గద్యకు ఉదాహరణగా గ్రహించవచ్చు.

"........ .... యోశాంతుండ! యీకాంత నేర్పు చూచితే? వేల్పుల కడకు నేతెంచినఁ దన మాయ బట్టబయలంబడు నవియెడు తలంపున రాఁ

1. వేంకటేశ్వర గద్య - భగవత్స్తుతిః.

గూడక, సురల యానసంబు లేగతి నాలోకింతు? నని నాకగమనంబు పరిహరించె, నందును ధరణి విడిచి దివికి నడు గటు వెట్టనని తొడిఁ వడ, నీమీది యాన పెట్టుకొనుట, ఖేచరత్వంబు కలిమియు సందియంబ! ఇంత తడవు ప్రియకాంత యనుచు నెట్లు నమ్మి?" తని పల్కిన "నది వివేకమార్గంబ యగు" నని నలకూబరుండు తద్వాక్యంబులకు నిరుత్తరమై యున్న, తన దండ చెలువ నుండనీక "యోసి! మాయలాడివిగదే!" యని మెడపట్టి పాయం ద్రోయుటయు; నదియ సందుగా నా యిందుముఖి యందండ దట్టించి, "యిట్టి వెడ సేతలచేత నాథుని కెడసేసి, చేతోజాత హేతిఘాతంబుల పాలుపఱచి" తని పలికి, యాతరళాక్షిని 'హేతిఘాత నిమిత్తంబు చేతన, కాయ వియోగంబు నొందు" మని శపించెను. నలకూబరుండును దత్కాలం బెట్టిదియొకాని, యోగాములు వివేకింపలేక, "యిది యిట్టి శాపంబునకుదగు" నని బలికి, "యోసి నీపే రెద్ది? యెట్టిదాన?" వని యడిగె నప్పుడు తత్ప్రతిరంభ సైరింపక.[1]

ఇందులో వస్తువు సంభాషణాపూర్వకవాదం. శృంగార రసం, అభినయ పూర్వకమైన శైలీ ఉన్న గద్యం.

"అని యిట్లు బహు ప్రకారంబుల బంతంబులాడు హింసాక్రోధుల దృష్టాలోభుల విలోకించి మహామోహుండు మీరు నలుగురుం గలిగిన ఫలంబు చాల దినాల నుండియు మనతోడఁ బోరాటగొన్న శ్రద్ధా తనూజ శాంతియను కుంటెన కత్తెం దుత్తుమురు చేయుండని పనిచి యాత్మగతంబున శాంతి యత్యంత మాతృ వత్సల గావున దదీయ జననియగు శ్రద్ధను బద్ధురాలిని చేసి పట్టితెచ్చినంజాలు శాంతి మాతృ వియోగ దుఃఖాతి శయంబు నదనుదానె కృశియించి నశియించి నదియ మంచి యుపాయంబు శ్రద్ధం బట్టి తేనేపునది నాస్తికతయని తలంచి కెలవులనున్న విభ్రమావతియను దానింజూచి నీ చెలికత్తెయ నాస్తికతా విలాసినిందోడి తెమ్మనిన నదియునుం జని నాస్తికతా వనిత తోడ నీ వృత్తాంతంబు చెప్పిన విని యమ్మిథ్యాదృష్టి నెచ్చెలీ! పెక్కు దివసంబుల నుండి రాజసమ్ముఖంబునకు వచ్చుట లేదు. నన్ను తేడింకనేమని దూఱెడునోకదా యనిన విభ్రమావతి నాస్తికతా! నిన్ను రెండు కన్నులంగన్న మాత్రంజన మహామోహుండు తన్ను దా నెఱుంగక యుండుంగాక యతడిక నిన్ను దూరునే నీ మహిమ నీ వెఱుంగ వింతియ యో కలకంఠీ! నీ కన్నుల నిదుర దేరుట కారణంబు చెప్పుమనిన నేకవల్లభలైన పల్లవాధరలు సహితము నిదుర గానరు బహువల్లభనైన నాకు నిదుర గలదే బహువల్లభ నెట్లైతినంటేని

1. కళాపూర్ణోదయం - తృతీయాశ్వాసం - 246 వ వచనం.

మొదలు మహామోహుండు ననుపు విటుండు. కామక్రోధ లోభులు మచ్చిక బోజుంగులు, విభ్రమావతి! వీరలు నలువురేయని చెప్పనేల యిక్కాలంబునం గల మగవారల లోనం జిన్న పెద్ద యనక యందఱంగలయ గైకొండు ననిన విభ్రమావతి సకియా! కామునకు రతియును గ్రోధునకు హింసయు లోభునకు దృష్టియు బ్రాణనాయికలు. వీరలకును జిడు ముడిక లేకుండుట చోద్యం బనిన వారికి నాకు బాయరాని పోరామి గావున నసూయబడరనిన గామినుల లోన నీవంటి సౌభాగ్యంబు గలయది భువనత్రయంబునలేదు సవతులు నైతము నిచ్చల మచ్చరింపక నిచ్చలు బొరపొచ్చెములేని మచ్చికలం గూడి యాడి యున్నవారు నీవిప్పుడీ నిదురచేరు కన్నుల చిన్నెలతోడి చెన్నుల మోపి కెంపుల మేని సొంపుల నరవిరి బాగునై వెడవెడ నందియలు మొరయు నెడనెడ నడుగులు తడబడ నడుచు తీరు గనుంగొని మహామోహుండు మానసంబున ననుమాన పడునో యని శంకించెదన నిన్ మిధ్యాదృష్టి విభ్రమావతిం గనుంగొని.[1]

ఈ వచనం శృంగారం, హాస్యరసభావాలతో కూడి ఉంది. వైదర్భీ, గౌడీరీతులలో రచన కనిపిస్తుంది.

అలౌకిక భావాలను ఇందులో పాత్రలుగా చేసి వారి సంభాషణా, చేష్టలను వస్తువుగా గ్రహించారు జంటకవులు.

ఇది చిత్రగద్యకు లక్ష్యప్రాయం అనదగినది.

అదియు మహా ప్రసాదంబని మురిపంపు నడకల జైనుడగ్గఱంజని కల కల నవ్వుచు గలికి చూపు మెఱుంగుల ధైర్యతిమిరంబు విరియించి కాంచన చషక దగద్ధగాయమాన దోర్మూల రోచులవీచులు వెల్లివిరియ ఘల్లుఘల్లున గంకణంబులు మొరయ హస్తమస్తక సంయోగంబు చేసి వచనమదిరా మోదంబునం దదీయ దుర్వాసన పీసర పుచ్ఛం గర్ణంబునం బిసపిస ననమశర మంత్రంబు చెప్పి గొప్ప చనుగుబ్బలు ఱొమ్మున గాడిపాఱ బిగియ గౌగిలించినవాడు సంచనంచలై రోమాంచంబు ముంచుకొన నంతఃకరణంబు గిలిగింతలు వోవ 'నర్హంత' 'యర్హంత' యనుచు నంత కంతకు నింద్రియ వికారంబు బలవంతంబై సుధిల్లి నల్లల్ల నెమలిపించియంబనం గప్పుకొనుచు నొప్పుల కుప్పయగు నప్పండంతి బేర్కొని నాకోర్కెం సఫలంబుగా బునరాలింగనంబు గావింపుము శ్రావకీ జనంబులు నీ కాలిగోరునంబోరు నీ దర్శనంబు గదా సౌఖ్యమోక్ష సాధనంబని వలికి కాపాలికుంగనుంగొని యోకాపాలికాచర్యా నాకు మహా భైరవమతంబు పదేశింపుమనిన సిద్ధుండు బౌద్ధక్షపణకుల గూర్చుండ బెట్టుకొని కరతలంబుననున్న కపాల భాజనంబు దప్పక చూచి

1. ప్రబోధ చంద్రోదయం - ద్వితీయాశ్వాసం - 69 వ వచనం.

భైరవ ధ్యాన నిమీలిత నేత్రుండైన మాత్రంబున దత్పాత్రంబు మదిరారసంబున నిండిన దాగొంత యాస్వాదించి శేషంబు భిక్షు క్షపణకుల కిచ్చుచు.

ఈ వచనంకూడా చిత్రగద్యకు లక్ష్యప్రాయం మాత్రమే ఇందులో శృంగార చేష్ట వర్ణితమైనది.[1]

వైదర్భీరీతీ, కైశికీ వృత్తులలో ఈ రచన సాగింది.

ఈ విధంగా సంగీత గద్య ప్రబంధాలకు పూర్తిగా లక్ష్యాలు కాకపోయినా సంగీత లక్షణ గంధంతో కవులు తమ కావ్యాలలో లక్ష్యాలనదగిన వచనాలను ప్రతిభతో రచించారు.

ఇటువంటి గద్యలు కొన్ని గానయోగ్యమైనవీ, కొన్ని గానంతో బాటు అభినయానికి కూడా అర్హమైనవీ అని చెప్పవచ్చు.

సాహిత్యలోకంలో సంగీత శాస్త్రంలో సూళాది ప్రబంధరీతుల్ని కొంత కలిగి ఉన్న ఉదాహరణ ప్రబంధం కూడా ఇక్కడ కొంత ప్రకటించవలసి ఉంది.

## ఉదాహరణ ప్రబంధం :

ఇది సాహిత్యలోకంలో ప్రత్యేక ప్రశస్తిని పొందినదీ, సంగీత శాస్త్రం లోని రాగతాళ మాలికలుగా రచింపవలసిన సూళాదులతో కొంత పోలికనూ కలిగి ఉంటుంది. దీని ఇతివృత్తం అధికంగా దైవ స్తుతులూ, అప్పుడప్పుడు రాజ స్తుతులూ కలిగి ఉంటుంది. దైవస్తుతి పరత్వ సామ్యంచేతనూ, ఒక్కొక్క భాగంలో వృత్తమూ, కళికోత్కళికలునూ కలిగి ఒక్కొక్క విభక్తిలో విర చితమై సంబోధన ప్రథమా విభక్తితో కలిపి విరచితమయ్యే ఉదాహరణ ప్రబంధం సూళాది వలే, గద్య ప్రబంధం వలే గానం చేయదగినది.

13 వ శతాబ్దివాడైన రావిపాటి తిప్పన్న శ్రీనాథునిచేత పొగడబడిన కవి. ఇతడు త్రిపురాంతకోదాహరణం రచించాడు.

అన్నమాచార్యుల దేశి సూళాది ఉదాహరణ ప్రబంధంవలెనే విభక్త్యాత్మ కాలైన వృత్తాలూ, కళికలూ, ఉత్కళికలతో ఏడు తాళాలతో సాగుతుంది. సాదృశ్యం కించిత్ మాత్రమే కనిపిస్తుంది.

ఈ దేశి సూళాది నాయికానాయక భావంతో సాగుతుంది. ఇది కూడా గద్య ప్రబంధం వలే గానం చేయదగి ఉండటం వల్ల సిద్ధాంత వ్యాస నిర్మాణ ప్రణాళికకు కించిత్ బాహిరమైనా అప్రస్తుతం కాదనే ఉద్దేశ్యంతో గతిమధ్య ప్రశంసగా ఇందు చేర్చడమైంది.

---

1. ప్రబోధచంద్రోదయం - తృతీయాశ్వాసం - 51 వ వచనం.

# ఉపయుక్త గ్రంథసూచిక

## ఆంధ్ర సాహిత్య కావ్యాలు


1. ఆముక్త మాల్యద - శ్రీకృష్ణదేవరాయలు, సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు. సం॥ 1967
2. కళాపూర్ణోదయము - పింగళి సూరన, సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు. సం॥ 1967
3. కవికర్ణ రసాయనము - సంకుసాల నృసింహకవి, సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు. సం॥ 1967
4. కాశీ ఖండము - శ్రీనాథుడు, వావిళ్ళ రామస్వామి శాస్త్రిలు, మద్రాసు వారి ప్రచురణ. సం॥ 19౬9.
5. క్రీడాభిరామము - శ్రీనాథుడు, - విస్మృత కవులు సంపుటం-I, వనపర్తి, పరిష్కర్త రామకృష్ణ కవి. సం॥ 1909.
6. గద్యత్రయము - చతుఃశ్లోకి-భగవద్రామానుజాలు, గోదా గ్రంథమాల - కృష్ణా జిల్లా. సం॥ 1987.
7. పండితారాధ్య చరిత్ర - పాల్కురికి సోమన, చిలుకూరి నారాయణరావు గారి పీఠికతో, అనంతపురం, ఆత్రేయాశ్రమము, సం॥ 1939.
8. పల్నాటి వీరచరిత్ర - శ్రీనాథుడు, వావిళ్ళవారి ప్రచురణ, సం॥ 1953.
9. పాండురంగ మాహాత్మ్యము - తెనాలి రామకృష్ణుడు, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1984.
10. ప్రభావతీ ప్రద్యుమ్నము-పింగళి సూరన, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1966.
11. ప్రబోధచంద్రోదయము - నంది మల్లయ, ఘంట సింగయ, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1976.

12. బసవ పురాణము - పాల్కురికి సోమనాథుడు, ఆంధ్రపత్రికా ముద్రణాలయము, చెన్నపురి, సం॥ 1952.

13. భగవత్స్తుతిః సంకలన కర్తలు - నోరి శ్రీరామ శర్మ, ఇంద్రకంటి సూర్యనారాయణ మూర్తి, వెంకట్రామ అండ్ కో, ఏలూరి వారి ప్రచురణ, సం॥ 1979.

14. మనుచరిత్రము - అల్లసాని పెద్దన, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1967.

15. రామాభ్యుదయము - అయ్యలరాజు రామభద్రుడు, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1967.

16. రాజశేఖర చరిత్రము - మాదయగారి మల్లన, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1967.

17. వసుచరిత - రామరాజభూషణుడు, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1967.

18. వీరభద్ర విజయము - బమ్మెర పోతన, వావిళ్ళవారి ప్రచురణ, సం॥ 1916.

19. శివరాత్రి మాహాత్మ్యము - శ్రీనాథుడు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు. సం॥ 1968.

20. శృంగార నైషధము - శ్రీనాథుడు, సాహిత్య అకాడమీ ప్రచురణ సం॥ 1961.

21. శ్రీమదాంధ్ర మహాభాగవతము - బమ్మెర పోతనామాత్యుడు, రాయల్ అండ్ కో, ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, మద్రాసు, సం॥ 1954.

22. శ్రీమద్వాల్మీకి రామాయణమ్ - ప్రకాశకః ఆర్. నారాయణ స్వామ్యార్యః, మదరాస్, లా జర్నల్ ప్రెస్, సం॥ 1933.

23. శ్రీ వేంకటేశ్వర వచనములు - తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు, వేంకటేశ్వర ఓరియంటల్ సిరీస్ నెం. 10, సం॥ 1945.

24. సింహగిరి నరహరి వచనములు - కృష్ణమాచార్యులు, సాహిత్య అకాడమీ ప్రచురణ, సం॥ 1980.

25. హరవిలాసము - శ్రీనాథుడు, ఆర్. వేంకటేశ్వర అండ్ కో, ఆనంద ముద్రణాలయము, మద్రాసు, సం॥ 1939,

## సాహిత్య విమర్శ గ్రంథాలు


1. ఆంధ్ర వచన వాఙ్మయము - ఉత్పత్తి వికాసములు - డా॥ ఎమ్. కుల శేఖరరావు, ఆంధ్రరచయితల కో-ఆప్. లి., ప్రెస్, హైదరాబాదు, సం॥ 1971.
2. ఆంధ్రసాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మికాంతం, గంగాధర పబ్లికేషన్స్, విజయవాడ, సం॥ 1985.
3. కావ్యాలంకార సంగ్రహము - రామరాజభూషణుడు, సన్నిధానం సూర్య నారాయణ శాస్త్రి వ్యాఖ్యతో, ఎం.ఎస్.కో. సికింద్రాబాద్ వారి ప్రచురణ, సం॥ 1976.
4. తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని కృతులు-ఒక పరిశీలన - డా॥ వై. సూర్యకాంత సిద్ధాంత వ్యాసం.
5. తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు-డా॥ వేటూరి ఆనందమూర్తి, ప్రభాకర ప్రచురణ, సం. 1974.
6. తెలుగు సాహిత్య సమీక్ష - డా॥ జి. నాగయ్య, మొదటి సంపుటం, నవ్య పరిశోధక ప్రచురణ, తిరుపతి, సం. 1983.
7. ప్రబంధ వాఙ్మయ వికాసము - పల్లా దుర్గయ్య, మొదటి సంపుటి, ఆంధ్ర రచయితల సంఘం, విద్యానగరంవారి ప్రచురణ, సం॥ 1973.
8. వాఙ్మయ మహాధ్యక్షుని పరిశోధనా వాఙ్మయము : మార్గ-దేశి - వడ్లమూడి గోపాలకృష్ణయ్య, కళాకృష్ణులు అండ్ ప్రోజెను, హైదరాబాదు వారి ప్రచురణ, సం॥ 1974.
9. సారస్వత వ్యాసములు - ప్రథమ సంపుటం, సంకలనకర్త డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, సాహిత్య అకాడమీ, హైదరాబాదు వారి ప్రచురణ, సం॥ 1969.

## సంగీత గ్రంథాలు


1. అధ్యాత్మ రామాయణ కీర్తనలు - మునిపల్లి సుబ్రహ్మణ్య కవి, లక్ష్మీ శ్రీనివాస పబ్లికేషన్స్, తెనాలి వారి ప్రచురణ, సం॥ 1980.
2. కూచిపూడి భామాకలాపము - శ్రీ సిద్ధేంద్రయోగి, శ్రీ వేదాంతం పార్వతీశ్వర శాస్త్రిణాపూరితమ్, బాలాజీ ప్రింటర్స్, విజయవాడవారి ప్రచురణ, సం॥ 1982.
3. గాన కళాబోధిని - ఎస్. సి. పార్థసారథి, బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలువారి ప్రచురణ, సం॥ 1965.
4. చతుర్దండిప్రకాశికా - వేంకటమ ఖిరచితం, మ్యూజిక్ అకాడమీ, మద్రాసు.
5. నాట్యశాస్త్రము-భరతముని కృతం, గుప్తార్థభావప్రకాశికా, డా. పోణంగి శ్రీరామ అప్పారావు, నాట్యమాలా ప్రచురణ, దుంధుభి సం॥రం.
6. నృత్త రత్నావళి - జాయప సేనాని, సంగీత అకాడమీ, హైదరాబాదు ప్రచురణ.
7. నృత్తరత్నావళి (నాట్యవేదము) - శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ అనువాదం, శ్రీలక్ష్మీ ముద్రణాలయం, గుంటూరు, సం॥ 1957.
8. భద్రాచల రామదాసు కీర్తనలు
9. శ్రీకృష్ణలీలా తరంగిణి - నారాయణ తీర్థులు, వావిళ్ళవారి ప్రచురణ, సం॥ 1967.
10. సంగీత దర్పణః - చతుర దామోదర విరచితం, సంగీత కార్యాలయం, హాథరస్. సం॥ 1950.
11. సంగీత రత్నాకరః - శార్ఙ్గదేవ విరచితం, కల్లినాథ వ్యాఖ్య, అడయార్ ప్రచురణలు, సం॥ 1950-55.
12. సంగీత రత్నాకరః - శార్ఙ్గదేవ విరచితం, సింహభూపాల వ్యాఖ్య, అడయార్ ప్రచురణలు, సం॥ 1950-55.
13. సంగీత రత్నాకరము - తెలుగు అనువాదం - గంథం శ్రీరామమూర్తి, తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, సం॥ 1986.
14. సంగీత సూర్యోదయః - శ్రీ లక్ష్మీనారాయణ విరచితం, వరంగల్లు సంగీత కళాశాల గ్రంథాలయం.
15. సంగీత శబ్దార్థ చంద్రిక - అరిపిరాల సత్యనారాయణ మూర్తి, ములుకోల ప్రింటింగ్ ప్రెస్ విజయవాడ వారి ప్రచురణ, సం॥ 1954.

## సంగీత విమర్శ గ్రంథాలు

1. ఆంధ్ర సంగీత శాస్త్రము-కోరి వేంకటసూర్య ముఖ్యప్రాణ గిర్మాజీరావు, ప్రథమభాగం, సం॥ 1961.
2. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - ఆచార్య బాలాంత్రపు రజనీకాంత రావు, విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ, 1958.
3. ప్రాచీనాంధ్ర మహాకవుల సంగీత ప్రతిపత్తి- డా॥ శ్రీమతి బూదరాజు వేంకట శారద, సిద్ధాంత వ్యాసం, నాగార్జున విశ్వవిద్యాలయం.
4. భారత సంగీత ఇతిహాసము - ప్రథమ భాగము : ఆంధ్ర సంగీతము, మంగిపూడి రామలింగశాస్త్రి, న్యాయవాణి ప్రింటింగ్ ప్రెస్, రాజమండ్రి వారి ప్రచురణ సం॥ 1971.
5. సంగీత సంప్రదాయ ప్రదర్శిని (థియరీ) - మొదటి భాగము-అరిపిరాల సూర్యనారాయణ మూర్తి, శ్రీ పాండురంగ ప్రింటింగ్ వర్క్స్, విజయవాడ వారి ప్రచురణ, సం॥ 1960.

## సంచికలు

1. పశ్యంతి - తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠం వారి ప్రత్యేక సంచిక, రాజమండ్రి, సం॥ 1988-89.
2. తెలుగు వాణి మాసపత్రిక - అంతర్జాతీయ తెలుగు సంస్థ, హైదరాబాదు.

## ఆంగ్ల గ్రంథాలు

1. Sangeeta Ratnakaram- A study by R. Ranga Ramanuja Ayyangar.
2. A History of Indian Music, Swami Prajananda, Volume-1. (Ancient Period), Ramakrishna Vedanta Math, Calcutta 1967.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 15 | హృదయ | హృదయే |
| | పుట్ నోట్ | సర్వసం | సర్వస్వం |
| 5 | 20 | మనుష్యని | మనుష్యడు |
| 7 | 23 | రసాధర్వ | రసానాధర్వ |
| 11 | 18 | స్వంచిత | స్వాంచిత |
| 17 | 13 | రోగగ్రస్తుడై చికిత్స వల్ల | రోగగ్రస్తుడై నాడని భ్రమించి నమి తండి తాను చేసిన చికిత్సవల్ల |
| | 17 | తాండవకార | తాండవాకార |
| | 17 | నాహ్యాభిముఖుడై దట్టిల | నాట్యాభిముఖుడనై వట్టిల |
| | పుట్ నోట్ | పండితారాధ్య చరిత్ర | బసవపురాణం నాట్య నమి తండి కథ |
| 21 | 14 | సానాల | స్థానాల |
| 29 | 16 | చండాలేతరుడు | చండాలుడు |
| 31 | 7 | ప్రభాతాయతా | ప్రభాతాయాతా |
| | 18 | పంచామాలు | పంచమాలు |
| 32 | 21 | సఫలముగా | సఫలమున |
| 42 | 2 | విప్రకర్ణ | విప్రకీర్ణ |
| 47 | 13 | సముద్రాంతర్హ్వద్య | సముద్రాంతర్హృద్య |
| 45 | 23 | గద్మస్య | గద్యస్య |
| 54 | పుట్ నోట్ | వచనంలు | వచనాలు |
| 61 | 19 | Sanchgri | Sanchari |
| 75 | 20 | చూర్డిక | చూర్ణిక |
| 79 | 14 | ఇటువంటివే | ఇటువంటిదే |
| 83 | 10 | నిషేవ్యమా | నిషేవ్యమాణ |

## సంగీత విమర్శ గ్రంథాలు


1. ఆంధ్ర సంగీత శాస్త్రము-కోతి వేంకటసూర్య ముఖ్యప్రాణ గిర్మాజీరావు, ప్రథమభాగం, సం॥ 1961.
2. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - ఆచార్య బాలాంత్రపు రజనీకాంత రావు, విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ, 1958.
3. ప్రాచీనాంధ్ర మహాకవుల సంగీత ప్రతిపత్తి- డా॥ శ్రీమతి బూదరాజు వేంకట శారద, సిద్ధాంత వ్యాసం, నాగార్జున విశ్వవిద్యాలయం.
4. భారత సంగీత ఇతిహాసము - ప్రథమ భాగము : ఆంధ్ర సంగీతము, మంగిపూడి రామలింగశాస్త్రి, న్యాయవాణి ప్రింటింగ్ ప్రెస్, రాజమండ్రి వారి ప్రచురణ సం॥ 1971.
5. సంగీత సంప్రదాయ ప్రదర్శిని (థియరీ) - మొదటి భాగము-అరిపిరాల సూర్యనారాయణ మూర్తి, శ్రీ పాండురంగ ప్రింటింగ్ వర్క్సు, విజయవాడ వారి ప్రచురణ, సం॥ 1960.


## సంచికలు


1. పశ్యంతి - తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠం వారి ప్రత్యేక సంచిక, రాజమండ్రి, సం॥ 1988-89.
2. తెలుగు వాణి మాసపత్రిక - అంతర్జాతీయ తెలుగు సంస్థ, హైదరాబాదు.


## ఆంగ్ల గ్రంథాలు


1. Sangeeta Ratnakaram- A study by R. Ranga Ramanuja Ayyangar.
2. A History of Indian Music, Swami Prajananda, Volume-1. (Ancient Period), Rama krishna Vedanta Math, Calcutta 1967.